

టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే పెంచగలిగితే
అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది






*
ఇన్‌క్రిమిన్ దళంలో చేరండి...
పెరుగుదల నిచ్చు ఆకలి పొందండి!

పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రిమిన్ సిరప్ — 175 మి.లీ 57 మి.లీ.
ఇన్‌క్రిమిన్ డ్రాప్స్ పసి బిడ్డలకు 10 మి.లీ.

# *ఇన్‌క్రిమిన్
టానిక్




Lederle

* అమెరికన్ సయనమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు

అన్ని మందుల షాపుల్లో లభించుచున్నది

లింటాస్ - INC. 21-500 TL

**Statement about ownership of CHANDAMAMA ( Telugu )**
**Rule 8 ( Form IV ), Newspapers ( Central ) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each calendar month |
| 3. *Printer's Name* | : | B. V. REDDI |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | Prasad Process Pvt. Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VISWANATHA REDDI |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | Chandamama Publications<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | Chandamama Publications<br>PARTNERS:<br>1. Sri B. Nagi Reddi,<br>2. Smt. B. Padmavathi,<br>3. Smt. B. Bharathi,<br>4. Sri B. V. Sanjaya Reddi ( Minor ),<br>5. Sri B. N. Suresh Reddi ( Minor ),<br>6. Sri B. V. Satish Reddi ( Minor ). |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1972*


లోకకంటకుడైన రావణాసురుణ్ణి వధించడానికై మహావిష్ణువు రామావతారం ఎత్తాడు. ఆదిశేషువు శంఖచక్రాలతో లక్ష్మణ భరత శత్రుఘ్నులుగానూ ఆదిలక్ష్మి సీతగానూ భూమిపై అవతరించారు


పదునాలుగేళ్ళ వయసులోనే రాముడు తాటకిని సంహరించాడు
విశ్వామిత్రముని సంతోషించి రామునికి దివ్యాస్త్రాలన్నీ ఉపదేశించాడు


రాముడు విశ్వామిత్రుని యాగానికి మారీచ సుబాహులు భంగం చెయ్య కుండా కాపాడాడు


మానవమాత్రులెవరూ కదల్చలేనిదీ మహాగొప్పదీ అయిన శివధనుస్సు శ్రీరాముడు అవలీలగా ఎక్కుపెట్టి భగ్నంచేశాడు సీతారాముల కల్యాణం వైభోగంగా జరి గింది


దశరథ మహారాజు శ్రీరామునికి పట్టాభిషేకం చేయనిశ్చయించాడు. కైక దాసి మంథరకు ఇది ఇష్టం లేదు. రాముని పద్నాలుగేళ్ళు అడవు లకు పంపమని, భరతునకు పట్టాభిషేకం జరి పించమనీ దశరథుని వరాలడుగమని కైకకి దుర్బోధ చేసింది.


శ్రీరాముడు తండ్రి ఆజ్ఞ పాటించి సీత, లక్ష్మణుడు వెంటరాగా అడవులకు వెళ్ళాడు పుత్ర వియోగం భరించలేక దశరథుడు మరణించాడు


భరతునకు ఈ సంగతి తెలిసి ఎంతో దుఃఖించాడు
రాముని రాజ్యానికి రమ్మని బ్రతిమాలాడు.
చివరకు రాముని పాదుకలు తీసుకుని వాటినే
రాజప్రతినిధులుగా సింహాసనంపై ప్రతిష్ఠించాడు


రావణుని చెల్లెలు శూర్పణఖ శ్రీరాముని చీకాకు
పెడుతూంటే లక్ష్మణునికి కోపం వచ్చి దాని
ముక్కు చెవులు కోసి పంపించాడు


ప్రతీకారంగా రావణుడు, రాముని దూరంగా
తీసుకుపొమ్మని మాయలేడిని పంపించాడు


సీత ఒంటరిగా వుండగా రావణుడు వచ్చి
ఆవిడను అపహరించుకుని పోయాడు


దశరథుని మిత్రుడైన జటాయువు సీతని
కాపాడబోయాడు. కానీ రావణుడు వాని
రెక్కలు నరికి నేల కూల్చేశాడు


రాముడు సుగ్రీవునితో
మైత్రి చేసుకున్నాడు
హనుమంతుని
సీతను వెతకడానికై
పంపాడు. హనుమ
సముద్రం దాటి
లంక చేరాడు


లంకిణిని చావ గొట్టాడు


అశోకవనంలో సీతమ్మను కలుసుకుని ధైర్యం చెప్పాడు. ఆవిడ ఇచ్చిన ఆనవాలు తీసుకున్నాడు


రామపరాక్రమం చెప్పి రావణుని బెదిరించి లంకంతా కాల్చి రాముని వద్దకు తిరిగివచ్చాడు


రామదండు సముద్రానికి వారధి కట్టి లంక చేరుకున్నారు


యుద్ధంలో శ్రీరాముడు కుంభకర్ణుని వధించాడు


సమరంలో మూర్ఛపోయిన లక్ష్మణుని కోసం హనుమ సంజీవిని తెచ్చాడు. లక్ష్మణుడు మూర్ఛ తెలిసి రావణపుత్రుడైన ఇంద్రజిత్ ని వధించాడు


రామబాణంతో రావణాసురుడు హతుడైనాడు


సీతారామలక్ష్మణులు పరిజనంతో పుష్పక విమానంలో అయోధ్యచేరుకున్నారు. శ్రీరామచంద్రప్రభువుకి వైభవంగా పట్టం కట్టారు.





# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["సౌందర్య దానం"] పంపినవారు వి. హేమావతి. ఈ కథలో కార్యసాధన చేసే వారిలో రెండు రకాలను చూస్తాం. ఒకరు ఊహా లోకాలలోకి వెళ్ళిపోతారు. రెండో రకం వాళ్ళు వాస్తవదృష్టితో వ్యవహరిస్తారు. విజయం రెండో రకానికే లభిస్తుంది.

"న్యాయదేవత" అన్న కథలో లోభమే లోభిని పట్టిఇవ్వటం చిత్రించబడింది.

"అసంతుష్టి" అన్న కథలో తృప్తి లేని వాడి వైఖరి చిత్రించబడింది.

సంపుటి 50 మార్చి '72 సంచిక 3








అతిథి, ర్బాలకశ్చైవ, స్త్రీజనో, నృపతి స్తథా
ఏ తే విత్తం న జానంతి, జామాతా చైవ పంచమః. 1

[అతిథీ, పిల్లవాడూ, ఆడదీ, రాజూ, అల్లుడూ — ఈ అయిదుగురూ డబ్బు గురించి తెలుసుకోరు.]

రాజా రాష్ట్రకృతం పాపం,
రాజపాపం పురోహితః,
భర్తా చ స్త్రీకృతం పాపం,
శిష్యపాపం గురు ర్భవేత్. 2

[రాష్ట్రంలో జరిగే పాపం రాజుది. రాజు చేసే పాపం పురోహితుడిది. భార్య చేసే పాపం భర్తది. శిష్యుడు చేసే పాపం గురువుది.]

వృశ్చికస్య విషం పుచ్ఛం,
మక్షికస్య విషం శిరః,
తక్షకస్య విషం దంష్ట్రా,
సర్వాంగం దుర్జనే విషం. 3

[తేలుకు తోకలోనూ, ఈగకు తలలోనూ, పాముకు కోరలలోనూ విషం ఉంటుంది. దుర్జనుడికి శరీరమంతా విషమే.]

హెచ్చరికలు



# గుమ్మడి కాయల దొంగ

ఒక గ్రామంలో గుమ్మడికాయల వ్యాపారి ఒకడు ఉండేవాడు. అతను తాను పండించిన గుమ్మడికాయలను మధ్యవారికి అమ్మక, బండి మీద తీసుకుపోయి, గిరాకీ బాగా ఉండే దూర గ్రామాలలో అమ్మి సొమ్ము చేసుకునేవాడు.

ఒకనాడు అతను ఇలాగే బయలుదేరి తన గుమ్మడికాయల బండితో సహా ఉదయగిరి ప్రాంతంలో ఉన్న, ఒక గ్రామం చేరుకున్నాడు. అప్పటికే చీకటి పడుతూ ఉండటం చేత, అతను ఆ రాత్రికి ఎక్కడనైనా విశ్రాంతి తీసుకుని, తెల్లవారి ప్రయాణం సాగింతామనుకున్నాడు.

ఇలా అనుకుంటూ అతను బండిని గ్రామంలోకి తోలుకు పోతూండగా ఒక ఇంటి ముందు నిలబడి ఉన్న ఆసామి అతన్ని నిలిపి, "ఏ వూరు? ఏం పేరు? ఏం పని?" అని మామూలు ప్రశ్నలు వేశాడు. గుమ్మడికాయల వ్యాపారి తన గొడవ అంతా చెప్పుకుని, ఆ రాత్రి తనకు బస కావాలన్నాడు.

"దానికేంభాగ్యం? ఈ రాత్రికి మా ఇంట బస చెయ్యి," అన్నాడు శరభయ్య అనే ఆ ఆసామి.

ఆయన బండి విప్పించి, గుమ్మడికాయలు వసారాలో పెట్టించి, ఎడ్లకు గడ్డీ, నీరూ పెట్టించి, వ్యాపారికి సుఖంగా భోజనం పెట్టి, అతను పడుకునేటందుకు ఏర్పాటు చేశాడు.

వ్యాపారి శరభయ్య ఆదరాన్ని కొనియాడి, ప్రయాణంతో బడలి ఉండటాన, పడుకుంటూనే గాఢ నిద్రపోయాడు.

అతను మర్నాడు లేస్తూనే, శరభయ్యకు కృతజ్ఞతాపూర్వకంగా కొన్ని గుమ్మడికాయలు ఇద్దామనుకుని, వసారాలోకి వెళ్ళి చూసేసరికి, గుమ్మడికాయలలో సగమే ఉన్నాయి. తనకు మహోపకారం చేశా

బుర్లె నాగేశ్వరరావు



డనుకున్న శరభయ్యే తనను మోసం చేశా డని స్పష్టమయింది.

వ్యాపారి మండిపడుతూ, "శరభయ్యా, నమ్మబలికి ఇంత మోసం చేస్తావుటయ్యా? నువేమో ధర్మాత్ముడి వనుకున్నాను. నా గుమ్మడి కాయలు కాజేస్తావా?" అని ఆవేశపడ్డాడు.

శరభయ్య ఏమాత్రమూ తీసిపోక, "నీకే మన్నా బుద్ధి ఉండే మాట్లాడుతున్నావా? తిన్న ఇంటికే కన్నం వేసినట్టు, నా వల్ల ఉపకారం పొంది నాకు దొంగతనం అంట గడతావా? ఛీ. ఛీ! నీవంటి వాణ్ణి చేర దీయటం నాదే పొరపాటు!" అంటూ రుస రుసలాడాడు.

"మంచిగా నా గుమ్మడి కాయలు నా కిచ్చెయ్యి. నా దారిన నేను పోతాను," అన్నాడు వ్యాపారి.

"ముందు బయటికి నడుస్తావా? లేదా?" అంటూ శరభయ్య మీది మీదికి వచ్చాడు.

శరభయ్యతో మాట్లాడటం వృథా అనుకుని, వ్యాపారి మిగిలిన గుమ్మడికాయలను బండిమీద వేసుకుని, న్యాయాధికారి ఇంటికి వెళ్ళి, అతడి మీద ఫిర్యాదుచేశాడు.

న్యాయాధికారి వ్యాపారితో, "నీ గుమ్మడి కాయలు దొంగిలించిన వాడు శరభయ్యే అయితే వాటిని నీకు ఇప్పించటం పెద్ద సమస్య కాదు," అని చెప్పి, శరభయ్యను పిలుచుకురమ్మని మనిషిని పంపాడు.

శరభయ్య వచ్చి న్యాయాధికారితో, తాను నిర్దోషిననీ, ఈ వ్యాపారికి కిందటి రాత్రి ఆతిథ్యం ఇచ్చిన పాపానికి తన మీద దొంగ తనం నేరం మోపుతున్నాడనీ, తనకు గుమ్మడికాయలు దొంగిలించవలసిన దుస్థితి లేదనీ, తన దొడ్లోనే కాసిన గుమ్మడి కాయలు తన ఇంట బోలెడు ఉన్నాయనీ అన్నాడు.

"నువు చెప్పినదంతా నిజమేనని నాకూ తోస్తున్నది. అయినా నీ వల్ల నేరం జరగ లేదని నిరూపించుకోవలసిన అవసరం ఉన్నది గదా! అందుకని నువు వెళ్ళి, మీ దొడ్లో కాసిన గుమ్మడి కాయ ఒకటి తీసుకురా," అన్నాడు న్యాయాధికారి.

శరభయ్య వెళ్ళాడు. అతను తిరిగి వచ్చే లోపుగా న్యాయాధికారి దానయ్య అనే వీధి నాటకాల వాణ్ణీ, వైద్యుణ్ణీ పిలిచి, ఏం చెయ్యాలో వాళ్ళకు రహస్యంగా చెప్పి ఉంచాడు.

శరభయ్య గుమ్మడికాయతో తిరిగి వచ్చాడు. న్యాయాధికారి వ్యాపారి బండి నుంచి మరొక కాయ తెప్పించి, "దానయ్యా, నువు బాగా తెలిసినవాడివి. ఈ రెండుకాయలూ ఒకే జాతివా? వేరు జాతులవా?" అని అడిగాడు.

"రుచిచూస్తే గాని చెప్పలేను, బాబుగారూ." అని దానయ్య ఒక చాకు తీసి, శరభయ్య తెచ్చిన గుమ్మడికాయ నుంచి ఒక చిన్న ముక్క కోసి, నోట్లో వేసుకుని నమిలి మింగి, గిలగిలా తన్నుకుంటూ అరవసాగాడు.

న్యాయాధికారి వైద్యుడి కేసి తిరిగి, "శాస్త్రిగారూ, దానయ్యకు ఏం వచ్చిందో చూడండి. సమయానికి దేవుడల్లే దగ్గిర ఉన్నారు!" అన్నాడు.

వైద్యుడు శరభయ్య తెచ్చిన గుమ్మడి కాయను పరీక్షించి, "ఇది విషం గుమ్మడి గాదుటండీ? విరుగుడు వెయ్యాలి." అంటూ దానయ్యను నడిపించుకుంటూ వెళ్ళాడు.

న్యాయాధికారి శరభయ్య కేసి తిరిగి, "శరభయ్యా, ఇదా నువు చేస్తున్న పని? విషం గుమ్మడికాయలు దొడ్లో పండించి జనాన్ని చంపదలిచావా? ఇందుకు నీకేం శిక్ష వెయ్యాలి?" అన్నాడు.

"ఇది నా దొడ్లో కాసిన గుమ్మడికాయ కాదు, మహాప్రభో! అవి విషం గుమ్మడి కాయలని తెలిస్తే నేను కాజెయ్యకనే పోదును. వేసే శిక్ష ఏదో ఆ గుమ్మడికాయల వ్యాపారికే వెయ్యండి!" అంటూ కంగారులో తప్పు ఒప్పేసుకున్నాడు శరభయ్య.

"నువు దొంగతనం ఒప్పుకున్నావుగద! దొంగిలించిన వ్యాపారికి కాయలు ఇచ్చెయ్యి. దొంగతనం చేసినందుకు ఈసారి నిన్ను జరిమానాతో విడిచిపెడుతున్నాను." అని న్యాయాధికారి, గుమ్మడికాయల వ్యాపారికి గుమ్మడికాయలు ఇప్పించి పంపేశాడు.





# కాపాలిని

కాశ్మీరదేశంలో ఒకప్పుడు ఒక సుక్షత్రియుడికి ఒకే ఒక కుమార్తె ఉండేది. ఆమె పేరు సీమంతిని. ఆమె అందగత్తె. దానికి తోడు తండ్రి చనిపోయాక ఆయన సొంత ఆస్తి అయిన అరణ్యాలూ, వనాలూ, కోటా సీమంతినివి అయాయి. అందుచేత, ఆ ప్రాంతంలో గల కులీనులైన యువకులు అనేకమంది ఆమెను వివాహం చేసుకోవటానికి ప్రయత్నించారు. వారిలో గణదేవుడనేవాడు ఆమెను నిజంగా ప్రేమించాడు. కాని సీమంతినికి వివాహం చేసుకునే ఆలోచన లేకపోయింది. ఆమె అందరినీ నిరాకరించింది.

సీమంతినిని కొండలూ, అరణ్యాలూ, అందులో ఉండే వింతజంతువులూ, పక్షులూ ఆకర్షించేవి. ఆమె తరచుగా కాలి నడకనో, గుర్రం మీదనో అరణ్యం కుండా వెళ్ళి, కొంతదూరాన ఉన్న గరుడశిఖరం మీద కూర్చుని, ఆ ఎత్తు నుంచి కనిపించే దృశ్యాలన్నిటినీ చూసి ఆనందిస్తూ గంటలకు గంటలు గడిపేది.

ఈ విధంగా ప్రకృతిలో లీనమైన సీమంతినికి కాపాలికశక్తులు సాధించాలన్న కోరిక క్రమంగా కలిగింది. బేతాళుణ్ణి వశం చేసుకుని, పరకాయ ప్రవేశమూ, కామరూపమూ, కామగమనమూ, ఇతరసిద్ధులూ సాధించ దలచి ఆమె విచిత్రమైన పూజలూ, వింత ఆహారమూ, ఉపాసనలూ ప్రారంభించింది. ఒక్కొక్కసారి ఆమె చంద్రుడి కేసి నిశ్చలంగా చూసి, స్పృహ తప్పిపోయేది; ఏవేవో మూలికలతో కషాయాలు చేసుకుని తాగేది; తన శరీరాన్ని క్రూరమైన శిక్షలకు గురి చేసుకునేది. ఈ విధంగా ఆమెకు కొన్ని శక్తులు వశమయాయి కూడాను.

ఈ వార్తలు విని గణదేవుడు చాలా బాధ పడ్డాడు. "సీమంతిని మామూలు మనిషి

వై. సోమేశ్వరశర్మ

కాకుండా పోతున్నది. మామూలు మనిషిగా ఉన్నప్పుడే నన్ను పెళ్ళాడ నిరాకరించింది; ఈ స్థితిలో ఇంకేం పెళ్ళాడుతుంది?" అను కున్నాడతను.

కాని ఆమెను మామూలు మనిషిగా చెయ్యాలన్న ఆలోచన అతన్ని పట్టుకుని వదలలేదు. సీమంతిని ఏమేమి పూజలు చేస్తున్నదీ అతను గమనిస్తూనే ఉన్నాడు.

నెలలు గడుస్తున్న కొద్దీ సీమంతినిని రక్షించాలన్న కోరిక గణదేవుడిలో జాస్తి కాసాగింది. చివరకు అతను, పింగళ అనే ఒక మంత్రగత్తె సహకారాన్ని కోరాడు.

పింగళ గొప్ప మంత్ర శక్తులు గలదని చెప్పుకునేవారు. కాని ఆమె తన తోటలో రకరకాల మూలికలు పెంచి, మందులు తయారు చేసేది. ఆమె గణదేవుడు చెప్పిన దంతా విని, "సీమంతిని కాపాలిని కాదలిస్తే మనమెందుకు అడ్డుపడాలి?" అని అడిగింది.

"నాకు ఇష్టంలేదు గనక! తెలిసిందా? నువు కోరిన డబ్బు ఇస్తాను. ఆమెను మామూలు మనిషిని చెయ్యగలవా? అంత అందమూ, తెలివితేటలూ గల సీమంతిని కాపాలినిగా జీవించి, కాపాలిని చావుచావడం ఘోరం!" అన్నాడు గణదేవుడు.

"ఏం? కాపాలినిగా జీవించటంలో ఆనందం ఉండదనుకున్నావా?" అని పింగళ అడిగింది.



"ఆనందం ఉండవచ్చు. కాని సుఖం ఉన్నదా?" అని గణదేవుడు అడిగాడు.

"ఉండదు. నీ భార్యగానే ఆమె ఎక్కువ సుఖపడుతుంది." అన్నది పింగళ.

"అందుకనే ఆమె నా భార్య అయేటట్టు చెయ్యి," అన్నాడు గణదేవుడు.

"సహాయం చేస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి. వచ్చే అమావాస్యనాడు వేటకుక్క లను వెంట బెట్టుకుని అరణ్యంలోకి వేటకు వెళ్ళు. నువు ఏ మృగాన్నీ వేటాడనవసరం లేదు. తెల్లని జింక కనపడేదాకా అరణ్య మంతా గాలించు. అది కనబడ్డాక దాన్ని తరిమి పట్టుకో. దాన్ని గాయపరచకుండా పట్టుకుని, దాని మెడకు ఉచ్చువేసి తెచ్చి,

రాత్రి అంతా దాన్ని నీ భవనంలోనే ఒక గదిలో ఉంచు. మిగిలినది నేను చూస్తాను," అన్నది పింగళ.

ఆమె అతన్ని తోట బయటికి సాగనంపి, తిరిగి తన ఇంటి కేసి పోయేటప్పుడు ఆమె ఎడమ కాలితో కొంచెం కుంటుతున్నట్టు గణదేవుడు గమనించాడు.

పింగళ చెప్పినట్టే అతను అమావాస్య నాడు తన వేటకుక్కలతో సహా అరణ్యం లోకి వెళ్ళాడు. అతను అరణ్యమంతా గాలి స్తూండగా తెల్లని జింక కనబడనే కనబడింది. వెంటనే తన వేటకుక్కలను దాని పైకి వది లాడు. జింక శరవేగంతో పరిగెత్త సాగింది.

కొంతసేపటికి ఒక్క కుక్క తప్ప మిగిలిన వేట కుక్కలన్నీ వెనక పడిపోయాయి. జింకకు చాలా దగ్గిరగా పరిగెత్తుతున్న కుక్క తనదికాదని గణదేవుడికి తోచింది. అది అంత పరుగులోనూ వెనకకాళ్ళలో ఎడమ కాలిమీద కుంటుతున్నట్టు కనిపించింది.

త్వరలోనే ఆ కుక్క జింక వెనక కాలిని నోటితో పట్టి ఆపింది. గణదేవుడు గుర్రం మీద వచ్చి, ఆ జింక మెడలో ఉచ్చు వేశాడు. తరవాత జింక పెనగులాడక అతని వెంట అతని ఇంటికి వచ్చేసింది. ఆ జింకను పట్టిన వేటకుక్క ఏమయినదీ గణదేవుడు గమనించలేదు.

అతను జింకను ఒక గదిలో పెట్టి తాళం వేసి, తన పడక గదికి వెళ్ళి, వెంటనే నిద్ర పోయాడు. తెల్లవారు ఝామున అతనికి నిద్రాభంగం అయేసరికి ప్రపంచమంతా తలకిందులైపోతున్నట్టు తోచింది. బయట పెద్ద తుఫాను చెలరేగుతున్నదో, ఇంటిమీద పిడుగులు పడుతున్నాయో, లేక భూకంపం వచ్చిందో అని అతను అనుకున్నాడు. కాని అదేమీలేదు. అప్పటిదాకా సీమంతినికి వశ మైన పిశాచాలన్నీ, తమ శక్తులతో సహా ఆమెను విడిచి వెళ్ళిపోయాయి.

గణదేవుడు జింక ఉండే గదిలోకి వెళ్ళే సరికి అక్కడ సీమంతిని ఉన్నది. ఆమె అతని భార్య కావటానికి సులువుగానే అంగీ కరించింది. వారిద్దరూ పెళ్ళాడి, చాలాకాలం సుఖంగా జీవించారు.






## 18

[ఉద్యానవనానికి వెళ్ళే దారిలో విఘ్నేశ్వరపూజారి ఎక్కిన రాకాసిఏనుగు మీద నూనె పోసి, ఖడ్గ జీవదత్తులు దానికి నిప్పుపెట్టారు. రాజు నిత్యానందుడు తన సైనికులను ఆటవికుల మీదికి ఉసికొల్ప చూశాడు. ఆటవికుల్లో నుంచి ఒక అజానుబాహుడు ముందుకు వచ్చి తాను ఆటవికుల నాయకుణ్ణని జీవదత్తుడితో చెప్పాడు. తరవాత—]

జీవదత్తుడు ఆటవికనాయకుణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. వాడి తీక్ష్ణమైన చూపూ, ధీమాగా నిలుచున్న తీరూ చూసి జీవదత్తుడికి, వాడి శక్తి సామర్థ్యాలలో గట్టి నమ్మకం కుదిరింది.

"మంచిది! నీ వాళ్ళందర్నీ అవసరం అయితే సైనికులను ఎదుర్కొనేందుకు సిద్ధంచెయ్యి. మీకై మీరు మాత్రం వాళ్ళను కవ్వించకండి!" అని జీవదత్తుడు, నాయకుడికి చెప్పి, పూజారి, స్వర్ణాచార్లను పిలిచి, "మీరు మా పక్కనే వుండండి, లేకపోతే చిక్కుల్లో పడతారు," అన్నాడు.

"అటు రాజూ, యిటు యీ ఆటవికులూ మమ్మల్ని చంపాలని చూస్తున్నారు, మాకేది దారి?" అంటూ విఘ్నేశ్వరపూజారి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

"నగరద్వారం దాటిం తర్వాత ఆ దారి సంగతి ఆలోచిస్తాం. మా దగ్గిర వున్నంత



వరకూ మీకు ఆటవికుల నుంచి ప్రమాదం రాదు. రాజు సంగతి మేం చూస్తాం,'' అన్నాడు జీవదత్తుడు.

అంతలో రాజు నిత్యానందుడు పెద్దగా గొంతెత్తి, ''మహాశూరులారా! ఆ ఆటవిక మృగాలను మీరే నిరాయుధుల్ని చేసినా సరే, లేకపోతే మీరు దారి తొలిగినట్టయితే ఆ పని మా సైనికులు చేస్తారు,'' అన్నాడు.

''మాకు తెలుసు, మహారాజా! ముందు ఆటవికుల్ని మంచి మాటలతో నిరాయుధుల్ని చేసి, ఆ తరవాత వాళ్ళను చిత్రవధ చేయించాలని మీరు ఆలోచిస్తున్నారు. అది కుదరదు! మీరూ, వాళ్ళూ నగరం బయట బరిపెట్టుకుని పోరాడండి. మేము ప్రేక్షకులుగా వుండి ఫలితం ఎలా వుంటుందో చూస్తాం,'' అన్నాడు జీవదత్తుడు.

''నా రాజ్యంలో .. నా నగరంలో వుండి ... నన్నే ఆజ్ఞాపించటం ...'' అంటూ నిత్యానందుడు మాట్లాడ సాగేసరికి, ఖడ్గవర్మ చర్రున కత్తిదూసి, ''ఆ పాత చచ్చు పుచ్చు కబుర్లన్నీ కట్టిపెట్టు! నిన్నూ, నీ కిరీటాన్నీ రక్షించింది మేము! ఇక్కడ మేము ప్రభువులం!'' అని ఆటవికులతో, ''అందరూ నగరద్వారం బయటికి నడవండి,'' అన్నాడు.

ఆటవికులు ద్వారం కేసి కదిలారు. జీవదత్తుడు, పూజారినీ, ఆచారినీ వాళ్ళవెనగ్గా నడవమని చెప్పి, రాజుతో, ''మహారాజా! నగరద్వారం వెలపల ఆటవికులతో మీరు పోరాడవచ్చు. విజయం ఎవరిదవుతుందో చూసి, మా దారిన మేంపోతాం,'' అన్నాడు.

రాజు ఉగ్రుడైపోయి తన సైనికులను నగరద్వారం కేసి నడవమని ఆజ్ఞాపించాడు. కొద్దిసేపటికల్లా ఆటవికులూ, సైనికులూ ద్వారందాటి, దాని ముందున్న మైదానంలో, ఒకరికెదురుగా ఒకరు ఆయుధాలతో యుద్ధ సన్నద్ధులై నిలబడ్డారు. ఖడ్గ జీవదత్తులు పూజారీ, ఆచార్లతో రెండు పక్షాల మధ్యా వున్న ఖాళీ స్థలంలో నిలబడ్డారు.

నిత్యానందరాజు, పక్కన వున్న మంత్రీ, సేనానాయకుల కేసి ఓ మారు తలాడించి,

ఖడ్గ జీవదత్తులతో, "మహాశూరులారా! ఇక మీరు పక్కకు తప్పుకోండి. ఆటవిక పశువులను చెండాడమని నా సైనికులకు ఉత్తరు వివ్వబోతున్నాను," అన్నాడు.

జీవదత్తుడు ఆటవిక నాయకుడితో, "విన్నావా? మీ అందరికీ కొద్ది క్షణాల్లో చావో బతుకో తేలబోతున్నది," అని చెప్పి, రాజుతో, "మహారాజా! మరోసారి ఆలోచించుకోండి! ఆటవికులు ఓడితే చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళు అరణ్యంలోకి పారిపోయి హాయిగా బతుకుతారు. కాని, మీరు ఓడారో, మీ సింహాసనంపోతుంది! మీరు ప్రాణాలతో పారిపోగలిగితే, అరణ్యాలలో ఆకలములు తింటూ శేషజీవితం గడపవలసి వస్తుంది!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే రాజు ముఖం వెల వెల పోయింది. మంత్రి అది గమనించి అందరూ వినేలా పెద్ద గొంతుతో, "మహారాజా! లోగడ మీకు చెప్పానో లేదో! మీ తండ్రిగారు మరణించే ముందు తమ కోర్కెగా ఒక సంగతి నాతో చెప్పారు. ఏ పరిస్థితుల్లోనూ నగరద్వారం వెలపల రక్తపాతం జరగరాదనీ, అలా జరిగితే తన ఆత్మకు శాంతి వుండదనీ అన్నారు," అని చెప్పాడు.

"అవును, ఆ సంగతి మర్చిపోయాను. మహా మంత్రీ, సమయానికి గుర్తు చేశావు.



లేకపోతే తండ్రిగారి తుది కోర్కెకు భంగం కలిగించి, వారి ఆత్మకు శాంతి లేకుండా చేసి వుండేవాడిని! సరే, సైనికులంతా నగరంలోకి పదండి!" అంటూ నిత్యానంద రాజు నగరద్వారం కేసి దారి తీశాడు.

"పిరికి వెధవకు సమయానికి మంత్రి మంచి సాకు చూపాడు!" అంటూ ఖడ్గవర్మ పెద్దగా నవ్వాడు.

ఆటవికుల నాయకుడు ముందుకు వచ్చి జీవదత్తుడితో, "అయ్యా, మాకు అనుమతివ్వండి! దుర్భాషలాడే యీ రాజునూ, అతడి సైనికులనూ ఈటెలకు గుచ్చి నగరద్వారం ముందు నిలబెడతాం," అన్నాడు.



"యువ క్షత్రియసింహమా! అనుమతించు. ఈ రాజు చావుకు మహా విఘ్నేశ్వరుడు కూడా చాలా సంతోషిస్తాడు!" అన్నాడు పూజారి ఉత్సాహంగా.

"నోరు ముయ్యి! నీ చావుక్కూడా ఆ మహా విఘ్నేశ్వరుడు తప్పక సంతోషిస్తాడు!" అని ఖడ్గవర్మ, పూజారిని మందలించి నగరద్వారం కేసి చూశాడు.

రాజు నిత్యానందుడు తన సైనికులతో ద్వారం వెనక నిలబడి, ఖడ్గ జీవదత్తుల కేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూస్తున్నాడు. ఏ క్షణంలో అయినా సైనికులు తమ మీదికి దూకవచ్చునన్న అనుమానం ఖడ్గ జీవదత్తులకు కలిగింది.

"ఖడ్గా, ఈ రాజులో పిరికితనం పాలూ, మొండితనం పాలూ సరిసమానంగా వున్నట్టు కనబడుతున్నది. అనవసర రక్తపాతం తప్పేలా లేదు," అన్నాడు జీవదత్తుడు.

"సమ ఉజ్జీలైన శత్రు పక్షాల మధ్య జరిగే పోరాటం అనవసర రక్తపాతం ఎలా అవుతుంది? అది అవసరం అయిన రక్తపాతమే! ఇక్కడ రాజీకి ఆస్కారం వున్నట్టు కనబడటం లేదు. బలవంతుడూ, ధైర్యవంతుడూ, పోరాటంలో చాకచక్యం వున్నవాడూ జయిస్తాడు. అనవసర కాలయాపన ఎందుకు? యుద్ధమో, శాంతో యిప్పుడే తేలుస్తాను," అంటూ ఖడ్గవర్మ ఒక ఆటవికుడి నుంచి ఈటె ఒకటి తీసుకుని రాజు కేసి ముందుకు పోయి, "నిత్యానందరాజా! నీకు ఆటవికులతో యుద్ధం చేయాలన్న చేతి దురద యింకా వదిలినట్టు లేదు. ఇదుగో, నేను ఈటె ఎత్తి ఒకటి, రెండు, మూడు అనే లోపల మీరు నగరద్వారం మూయించినా సరే, లేకపోతే నగరద్వారం దాటి మైదానంలోకి వచ్చినా సరే!" అని ఒకటి, రెండు, మూడు అన్నాడు.

ఖడ్గవర్మ మూడు అనే లోపలే నగరద్వారం చటుక్కున మూసుకుపోయింది. ఆటవికులు విజయ సూచకంగా కేకలు పెట్టారు. ఖడ్గవర్మ తన చేతిలో వున్న ఈటెను బలంగా మూసి వున్న ద్వారాని కేసి



గట్టిగా విసిరాడు. అది వేగంగా పోయి ద్వారానికి తపీమంటూ గుచ్చుకున్నది.

"రాజుకు జ్ఞానోదయం అయినట్టున్నది, యిక మన దారిన మనం పోదాం," అన్నాడు జీవదత్తుడు.

అందరూ కదిలి ఒక గంట కాలం గడిచే సరికల్లా అరణ్యప్రాంతం చేరారు. అక్కడ ఆటవికులు ఖడ్గ, జీవదత్తులకు గొప్ప విందు చేశారు. స్త్రీలూ, పురుషులూ కలిసి ఆట పాటలతో వాళ్ళను వినోదపరిచారు. సూర్యాస్తమయానికి యింకా ఒకటి రెండు గంటల కాల మున్నదనగా, ఖడ్గ జీవదత్తులు ఆటవికులకు వీడ్కోలు చెప్పి, తిరిగి ప్రయాణం అయారు.

అంతవరకూ వాళ్ళ వెంట వుండి ఆటవికుల నుంచి ఎలాంటి ప్రాణభయం లేకుండా కాలం గడిపిన, విఘ్నేశ్వరపూజారీ, స్వర్ణాచారీ, ఖడ్గ జీవదత్తులు బయలు దేరగానే, వాళ్ళ వెంట పడి, "అయ్యా, మమ్మల్ని యిక్కడే వదిలేసి పోతున్నారా? సూర్యాస్తమయం లోపల యీ ఆటవికులు మమ్మల్ని చిత్రవధ చేస్తారు!" అంటూ గోలకెత్తారు.

"వీళ్ళిద్దర్నీ ఏం చేద్దామంటావ్, ఖడ్గా?" అని అడిగాడు జీవదత్తుడు.

"ఏం చేయటమనేది, యీ ఆటవికులు వింటుండగా చెప్పి లాభం లేదు. మన వెంట ఆ కనబడే కొండల వరకూ తీసుకుపోయి, అక్కడ ఏమి చేయటమో ఆలోచిద్దాం. వింధ్యపర్వతాల వరకూ యీ జంగుపిల్లుల్ని వెంట తీసుకుపోలేం గదా?" అన్నాడు ఖడ్గవర్మ.

"జంగుపిల్లులమైనా, యీ అరణ్యంలో ఏ కుందేలునో, అడివి కోడినో పట్టుకు తిని సుఖంగా బతికేవాళ్ళం. మనుషులం అవటం వల్లే యిన్ని చిక్కులొచ్చాయి. ఆ మహా విఘ్నేశ్వరుడు కలలో కనబడి నన్ను నట్టేట ముంచాడు!" అంటూ విఘ్నేశ్వరపూజారి లబలబలాడాడు.

"ఇప్పటికైనా మించి పోయింది లేదు. తెలివైన వాళ్ళు కనక, ఆ జంగుపిల్లుల్లాగే యీ అరణ్యంలో బతకండి. లేదూ, మరో




మాయ రాకాసి ఏనుగును తయారు చేసి, మరేదైనా రాజ్యం మీదికి దండెత్తండి," అన్నాడు ఖడ్గవర్మ పెద్దగా నవ్వుతూ.

"సరే, ప్రస్తుతానికి మా వెంట వుండండి. ఏం చేయాలో ఆలోచిద్దాం," అన్నాడు జీవదత్తుడు.

తరవాత నలుగురూ ఉత్తర దిక్కుగా బయలుదేరి సూర్యాస్తమయ వేళకు అరణ్యంలోని కొండప్రదేశాన్ని చేరారు. ఆ రాత్రికి అక్కడ వంట చేసుకుతిని, చెట్ల మీద పడుకున్నారు. మర్నాటి ఉదయం తిరిగి ఖడ్గ జీవదత్తులు ప్రయాణం అవుతూండగా పూజారీ, స్వర్ణాచారీ కూడా వాళ్ళ వెంట వస్తామన్నారు.

"మా వెంట ఎంతదూరం రాగలరు? మేం వింధ్యపర్వతాలకు పోతున్నాం. మార్గంలో తారసిల్లే భయంకర ప్రమాదాల నుంచి మాకు మేము ఆత్మరక్షణ చేసుకోవటమే కష్టం. మీ బాధ్యత కూడా మా తల మీదికెలా ఎత్తుకోగలం!" అన్నాడు జీవదత్తుడు.

"అయ్యా, మీ వెంట వస్తూ, దారిలో ఏదైనా పల్లెగాని, పట్నంగాని తగిలితే అక్కడ మేం వుండిపోతాం. ఈ అరణ్య మధ్యంలో మమ్మల్ని వదిలారో, ఆటవికులు మమ్మల్ని వేటాడేస్తారు," అన్నాడు విఘ్నేశ్వర పూజారి.

వాళ్ళ ప్రాణభయం చూసి, ఖడ్గ జీవదత్తులకు వాళ్ళిద్దరి మీదా ఎంతో జాలి కలిగింది. ఆ తరవాత రెండు రోజుల పాటు ఎలాంటి చిక్కులూ, ప్రమాదాలూ లేకుండా వాళ్ళు అరణ్యంలో ప్రయాణం చేశారు. మూడవనాటి సూర్యోదయం వేళ చెట్లమీద పడుకుని వున్న ఖడ్గ జీవదత్తులకు కొంచెం దూరం నుంచి ఒక మనిషి వేస్తున్న కేకలూ, దూరంగా పులి గాండ్రిస్తూండటం వినబడింది.

ఆ గండ్రగోళం వింటూనే ఖడ్గ జీవదత్తులు చెట్లకొమ్మల మీద లేచి కూర్చున్నారు. పూజారీ, ఆచారీ చెట్ల కొమ్మల్ని గట్టిగా కావిలించుకుని భయంతో వణికిపోసాగారు.




మాయ రాకాసి ఏనుగును తయారు చేసి, మరేదైనా రాజ్యం మీదికి దండెత్తండి," అన్నాడు ఖడ్గవర్మ పెద్దగా నవ్వుతూ.

"సరే, ప్రస్తుతానికి మా వెంట వుండండి, ఏం చేయాలో ఆలోచిద్దాం," అన్నాడు జీవదత్తుడు.

తరవాత నలుగురూ ఉత్తర దిక్కుగా బయలుదేరి సూర్యాస్తమయ వేళకు అరణ్యంలోని కొండప్రదేశాన్ని చేరారు. ఆ రాత్రికి అక్కడ వంట చేసుకుతిని, చెట్ల మీద పడుకున్నారు. మర్నాటి ఉదయం తిరిగి ఖడ్గ జీవదత్తులు ప్రయాణం అవుతూండగా పూజారీ, స్వర్ణాచారీ కూడా వాళ్ళ వెంట వస్తామన్నారు.

"మా వెంట ఎంతదూరం రాగలరు? మేం వింధ్యపర్వతాలకు పోతున్నాం. మార్గంలో తారసిల్లే భయంకర ప్రమాదాల నుంచి మాకు మేము ఆత్మరక్షణ చేసుకోవటమే కష్టం. మీ బాధ్యత కూడా మా తల మీది కెలా ఎత్తుకోగలం!" అన్నాడు జీవదత్తుడు.

"అయ్యా, మీ వెంట వస్తూ, దారిలో ఏదైనా పల్లెగాని, పట్నంగాని తగిలితే అక్కడ మేం వుండిపోతాం. ఈ అరణ్య మధ్యంలో మమ్మల్ని వదిలారో, ఆటవికులు మమ్మల్ని వేటాడేస్తారు," అన్నాడు విఘ్నేశ్వర పూజారి.

వాళ్ళ ప్రాణభయం చూసి, ఖడ్గ జీవదత్తులకు వాళ్ళిద్దరి మీదా ఎంతో జాలి కలిగింది. ఆ తరవాత రెండు రోజుల పాటు ఎలాంటి చిక్కులూ, ప్రమాదాలూ లేకుండా వాళ్ళు అరణ్యంలో ప్రయాణం చేశారు. మూడవనాటి సూర్యోదయం వేళ చెట్లమీద పడుకుని వున్న ఖడ్గ జీవదత్తులకు కొంచెం దూరం నుంచి ఒక మనిషి వేస్తున్న కేకలూ, దూరంగా పులి గాండ్రిస్తూండటం వినబడింది.

ఆ గందరగోళం వింటూనే ఖడ్గ జీవదత్తులు చెట్లకొమ్మల మీద లేచి కూర్చున్నారు. పూజారీ, ఆచారీ చెట్ల కొమ్మల్ని గట్టిగా కావిలించుకుని భయంతో వణికిపోసాగారు.

"జీవా, ఏమిటీ వింత? ఆ మనిషికే మన్నా మతి పోయిందా? చూడబోతే నిరాయుధుడు. పులిపిల్లల్ని చంకన బెట్టుకుని అలా కేకలు పెడతాడేం? వాడి కేకలు పులి విన్నట్టుంది. దాని గాండ్రింపు విన్నావా?" అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు అల్లంతదూరంలో వున్న చెట్టు కేసి చూశాడు. పేలికలూ వాలికలూ అయిన దుస్తుల్లో వున్న యువకు డొకడు రెండు పులిపిల్లల్ని ఎత్తుకుని గెంతుతూ, "పులీ! వ్యాఘ్రమా! రా, రా!" అంటూ కేకలు పెడుతున్నాడు.




"ఖడ్గా, ముందు మనం ఆ యువకుణ్ణి రక్షించాలి! తరవాత సంగతేమిటో తెలుసుకోవచ్చు." అంటూ జీవదత్తుడు చెట్టు మీది నుంచి కిందికి దిగసాగాడు. అంతలో పులి గాండ్రింపు యువకుడున్న చెట్టు పొదల వెనక వినబడింది.

"వాడెవడో చచ్చిన వాడి కిందే లెక్క. తల్లి పులి వచ్చి యువకుడి మీద పడుతున్నది!" అంటూ కత్తి దూసి ఖడ్గవర్మ చెట్టుమీది నుంచి కిందికి దూకి యువకుడి కేసి పరిగెత్తాడు.

"పిల్లల తల్లి! సాధ్యమైనంత వరకూ దాన్ని చంపకు!" అంటూ జీవదత్తుడు ఖడ్గవర్మను హెచ్చరించి, చెట్టు దిగి యువకుడి కేసి పరిగెత్తసాగాడు.

ఖడ్గ జీవదత్తులు ఆ ప్రదేశానికి వెళ్ళే లోపలే పులి, యువకుడున్న చెట్టు దగ్గిరకు పెద్దగా గాండ్రిస్తూ దూకుతూ వచ్చింది. యువకుడు దాన్ని చూస్తూనే, "రా, వచ్చావా? కంఠం ఒక్కసారి కొరికి చంపు!" అంటూ దాని కేసి ఉరికాడు.

పులికూడా నిరాయుధుడైన మనిషి తన కేసి దూకటం వింతా, భయం కలిగించి వుంటుంది. అది యువకుడి మీదికి దూకటమా, మానటమా అన్న సంశయంలో ఒక్క తృటికాలం వున్నచోటునే ఆగిపోయింది. అంతలో జీవదత్తుడు అక్కడికి చేరాడు. యువకుడి చేతిలో వున్న పులి పిల్లలు రెండూ ఒక్కసారిగా బుసలు

కొడుతూ, అతడి పట్టునుంచి బయట పడేందుకు గింజుకున్నవి.

అది చూస్తూనే తల్లి పులి రెచ్చిపోయి, పెద్దగా గాండ్రించి యువకుడి మీదికి ఎగిరింది. అంతలో అక్కడికి చేరిన జీవదత్తుడు దండంతో దాని మెడ కింద బలంగా ఒక్క పోటు పొడిచి, దూరంగా విసిరివేస్తూ, "ఖడ్గా, పులి దిమ్మెరపోయింది. అది తిరిగి లేచే లోపలే, ఏదైనా అడవి తీగెతో దాన్ని చెట్టుకు కట్టి వెయ్యి," అన్నాడు.

ఖడ్గవర్మ వెంటనే దూరంగా పరిగెత్తి ఒక చెట్టునుంచి వేలాడుతున్న బలమైన తీగ సరికి, పులి మెడకు కట్టి, రెండవ కొసను చెట్టుకు ముడివేశాడు.

"అయ్యా, మీరెవరో గాని నన్ను యీ పులి నుంచి రక్షించి, ఇంతకన్నా కూడా భయంకరమైన చావు పాలు చేస్తున్నారు," అన్నాడు యువకుడు ఏడ్పుగొంతుతో.

"చావాలంటే ఎన్ని దారుల్లేవు! చెట్టుకు ఉరిపోసుకోకపోయావా? ఏట్లో దూక్కపోయావా?" అన్నాడు ఖడ్గవర్మ కోపంగా.

"ఆత్మహత్య మహాపాపమని పెద్దలు చెపుతారు గదా! అందుకే యీ పులికి ఆహారమయి ..."

"ఇప్పుడు నువ్వు చెయ్యబోయిన పని ఆత్మహత్య కాదని పెద్దలు చెప్పారా? అసలు నువ్వెవరివి? పిచ్చివాడివా? మంచివాడివా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"అదేం ప్రశ్న, ఖడ్గా? నువ్వు కొంచెం శాంతించు," అని జీవదత్తుడు, యువకుడితో, "అబ్బాయీ, నీ కొచ్చిన కష్టం ఏమిటి? పులి గొంతుకొరికి చంపేదానికన్న కూడా భయంకరమైన చావు నీకు ఎవరి వల్ల రాబోతున్నది?" అని అడిగాడు.

యువకుడు వణికిపోతూ ఏదో జవాబివ్వబోయేంతలో, చెట్ల వెనకనుంచి ఖడ్గమృగం మీద ఎక్కివున్న వాడొకడు ముందుకు వచ్చి, "అరణ్యపురం గణాచారి చేతుల్లో వీడు భయంకర మరణం పాలు కాబోతున్నాడు!" అని, "ఎవర్రా! అందరూ వచ్చి వీళ్ళను చుట్టుముట్టండి!" అంటూ కేక పెట్టాడు.

—(ఇంకావుంది)






# సౌందర్యదానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ప్రయాసపడి సాధించదలచినది మరొకడు సులువుగా సాధిస్తే, జయంతుడి లాగా నీకు కూడా ఆశాభంగం కలగవచ్చునేమో! నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు జయంతుడి విచిత్ర కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఆరావళీ పర్వత ప్రాంతంలో అలకాపురి అనే రాజ్యాన్ని చిత్రసేన మహారాజు పాలించేవాడు. అనేకమంది రాజులకు ఆయన నాయకత్వం వహించి, అన్ని దేశాలకూ క్షేమమూ, సమృద్ధీ కలిగేటట్టు చూసేవాడు.

చిత్రసేన మహారాజుకు చాలా అపురూప సౌందర్యం గల కుమార్తె ఉండేది. ఆమెకు

## బేతాళ కథలు



జగన్మోహిని అనే పేరు వచ్చేసింది. ఆమెను పెళ్ళాడాలని అనేకమంది రాజకుమారులు ఉవ్విళ్ళూరేవారు. జగన్మోహిని స్వేచ్ఛగా తన భర్తను ఎన్నుకోగలందులకు రాజు స్వయంవరం ప్రకటించి, నానాదేశాల వారికీ ఆహ్వానాలు పంపాడు.

రేపు స్వయంవర మనగా జగన్మోహిని తన చెలికత్తెలతో వనవిహారానికి వెళ్ళి, ఒక సరోవరాన్ని చూసింది. ఎంతో అందంగా ఉన్న ఆ సరోవరంలో జగన్మోహినికి స్నానం చెయ్యాలనిపించింది. చాలా దూరం తిరిగి వెళ్ళవలసి ఉన్నదనీ, చీకటిపడేలోగా ఇంటికి చేరుకోవటం అవసరమనీ చెలికత్తెలు చెబుతున్నా వినక, జగన్మోహిని ఆ సరోవరంలోకి దిగి, ఉత్సాహంగా మూడుసార్లు మునిగి లేచింది.

ఇంతలో ఆమెను చూసి చెలికత్తెలు కెవ్వున అరిచి, ఆర్తనాదాలు చేశారు. జగన్మోహిని కంగారుపడి సరోవరం నుంచి బయటికి వచ్చేసి, తనను తాను చూసుకునే సరికి, మతిపోయింది. మేలిమి బంగారు రంగులో ఉండిన ఆమె శరీరానికి ఇనుము రంగు వచ్చేసింది. చర్మం గరుకెక్కింది. ఆమె ముఖంలో ఎలాటి కళా, కాంతీ లేదు. ఏడుస్తున్న చెలికత్తెలతో తానూ ఏడుస్తూ జగన్మోహిని ఇల్లు చేరుకున్నది.

ఆమెలో కలిగిన మార్పు చూసి ఆమె తల్లిదండ్రులు హతాశులైపోయారు. మర్నాడే స్వయంవరం. జగన్మోహినిని పెళ్ళాడే ఆశతో అనేకమంది రాజకుమారులు వస్తారు. వారికి తన కుమార్తెను ఎలాచూపటమో, చూపినా స్వయంవరం ఎలా జరపటమో రాజుకు అంతుబట్టలేదు.

ఆయన మంత్రికి జరిగిన సంగతి చెప్పి, కర్తవ్యం ఏమిటని అడిగాడు.

మంత్రి రాజవైద్యులను పిలిపించి, రాజకుమార్తెకు చికిత్స ఏమైనా ఉన్నదేమో చూడమన్నాడు.

"వ్యాధికి చికిత్స ఉంటుంది గాని, ఇదేదో శాపంలాటిది, దీనికి చికిత్స ఉండదు," అన్నారు వైద్యులు.

ఒక్క ఘనవైద్యుడు మాత్రం, "మహా రాజా, ఇది ఒక వ్యాధి అనే నా నమ్మకం. అయితే దీనికి సాధారణ చికిత్స అంటూ ఏమిటో నాకూ తెలియదు. కాని, సమస్త శరీర బాధ్యాలకూ వజ్రాయుధం లాటి విరుగుడు ప్రాచీన గ్రంథాలలో చెప్పి ఉన్నది. అది ఏమిటంటే, పంచవర్ణ సంజీవి సరోవరంలోని నీరు. ఆ సరోవరం ఎక్కడ ఉంటుందో నాకు తెలియదు. ఆ చికిత్స కూడా నే నెరిగినంత వరకూ ఎవరికీ జరగ లేదు," అన్నాడు.

మర్నాడు ముహూర్తానికి ముందే నానా దేశ రాజకుమారులు సభలో కూర్చుని, జగన్మోహిని రాకకోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నారు.

మంత్రి వారందరికీ కిందటి రోజు జరిగిన దుస్సంఘటన గురించి చెప్పి, "ఇప్పుడున్న స్థితిలో రాజకుమార్తెను ఎవరూ పెళ్ళాడ గోరరు. అయితే ఆమె యథారూపం ధరించటానికి ఒకే మార్గం ఉన్నట్టు తెలిసింది. ఎక్కడో పంచవర్ణ సంజీవి సరోవరం ఉన్నదట. దాని జలం తాగితే రాజకుమార్తెకు యథారూపం వస్తుందట. మీలో ఎవరు గాని ఆ జలం తెచ్చి రాజకుమార్తెకు ఏర్పడిన వికారాకారాన్ని పోగొట్టగలిగితే మా మహారాజుగారు తమ కుమార్తెనూ, రాజ్యాన్నీ కూడా ఇస్తారు," అన్నాడు.



ఈ మాట వినగానే ఇద్దరు తప్ప మిగిలిన రాజకుమారులందరూ లేచి, తమ తమ దేశాలకు వెళ్ళిపోయారు. వెళ్ళక మిగిలిన ఇద్దరిలో మాళవదేశపు యువరాజు జయంతుడు, "ప్రపంచంలో ఆ సరోవరం ఎక్కడ ఉన్నా సరే వెతికి, దాని నీరు తెచ్చి, రాజకుమార్తెను పెళ్ళాడతాను," అని శపథం చేసి, అప్పటి కప్పుడే ప్రయాణమైవెళ్ళాడు.

రెండవవాడు విజయపురి యువరాజైన విజయుడు. అతనికి ఒక ఆలోచన వచ్చింది. రాజకుమార్తె ఏ సరోవరంలో స్నానం చేసి రూపం మారిందో, ఆ సరోవరం దగ్గిరే ఆమె మారటానికి గల కారణం కూడా దొరక వచ్చు. ఇలా అనుకుని విజయుడు ఆ సరో



వరానికి దారి తెలుసుకుని అక్కడికి వెళ్ళాడు.

ఈ లోపల పంచవర్ణ సంజీవి సరోవరాన్ని వెతుక్కుంటూ బయలుదేరిన జయంతుడు ఆగకుండా ప్రయాణం చేసి, ఆ రాత్రికి కీకారణ్యం మధ్య ఉన్న ఒక పాడుబడిన కాళికాలయం చేరి, ఆ ఆలయంలోనే ఆ రాత్రి గడప నిశ్చయించాడు.

అతనికింకా నిద్రపట్టకముందే ఒక భయంకరమైన ఎలుగుబంటి ఘూంకరిస్తూ ఆ ఆలయం ప్రవేశించి, జయంతుడి పైకి ఉరికింది. జయంతుడు చప్పున లేచి కరవాలం దూసి, ఆ ఎలుగుబంటిని ఎదుర్కొని, దాన్ని చంపేశాడు.

చచ్చిపోగానే ఎలుగుబంటి అదృశ్యమై ఒక ముని అవతరించి, "నాయనా, గురువుగారి శాపానికి గురి అయిన నాకు శాపవిముక్తి కలిగించావు. నీకు నావల్ల ఏదన్నా ఉపకారం కావలిస్తే చెప్పు," అన్నాడు.

"స్వామీ, నేను పంచవర్ణ సంజీవిసరస్సు నుంచి జలం తీసుకు రావటానికని బయలుదేరాను. అక్కడికి దారి తెలిపి పుణ్యం కట్టుకోండి," అన్నాడు జయంతుడు.

"నాయనా, అది మేరుపర్వతం మీద ఉన్నది. అక్కడికి చేరటానికి నీ ఆయుర్దాయం చాలదేమో!" అన్నాడు ముని.

"ఆ ప్రయత్నంలో చావటానికైనా సిద్ధమే గాని, నేను మాత్రం నా ప్రయత్నం విరమించను," అన్నాడు జయంతుడు.

ముని అతని దీక్షను మెచ్చుకుని, అతనికి తన పాదరక్షలు ఇస్తూ, "వీటి సహాయంతో నువు ఆకాశమార్గాన ఆ సరస్సును చేరుకోగలవు. నీ పని తీరిపోగానే ఈ పాదరక్షలు నా వద్దకు తిరిగి వస్తాయి. వీటిని మరో విధంగా ఉపయోగించకు," అంటూ అంతర్థానమయాడు.

జయంతుడు ఆ పాదరక్షలను ధరిస్తూనే ఆకాశంలోకి లేచి, మేరుపర్వతం కేసి పోసాగాడు.

ఈ లోపల విజయుడు వన మధ్యంలో ఉన్న సరోవరానికి వెళ్ళి, ఆ రోజంతా

ఆ ప్రాంతాల గడిపాడు. ఆ రాత్రి గడిచి తెల్లవారింది. తెల్లవారుతూనే ఎవరో ముని ఆ సరోవరం దగ్గిరికి వచ్చి, అందులో స్నానం చేసి, వెళ్ళిపోవటానికి ఉపక్రమించాడు.

విజయుడికి ఆశ్చర్యం వేసింది. ఆ ముని రూపం ఏమాత్రమూ మారలేదు. అతను ఆ మునిని సమీపించి, "స్వామీ, మీరే నన్ను కాపాడాలి," అంటూ ఆయన కాళ్ళు పట్టుకున్నాడు.

"భయపడకు, నాయనా! ఎవరు నువు? నీకు వచ్చిన ఆపద ఏమిటి?" అని ముని విజయుణ్ణి అడిగాడు.

"ఈ సరోవరంలోనే స్నానం చేసిన రాజకుమార్తె తన అందాన్ని కోల్పోయింది. మీరూ ఇందులో స్నానం చేశారు, కాని మీలో ఏమార్పూ లేదు. ఆమెకు తిరిగి యథారూపం వచ్చే మార్గం మీకు తప్పక తెలిసి ఉండాలి. అది నాకు దయచేసి చెప్పండి," అన్నాడు విజయుడు.

"నిజమే, నాయనా. ఇది నా తపశ్శక్తితో సృష్టించిన కొలను. ఇందులో స్నానం చేసిన వారి అందం హరించేటట్టు నేనే ఏర్పాటు చేశాను. ప్రతివాళ్ళూ ఇందులో దిగి దీన్ని మలినం చెయ్యటం నా కిష్టం లేదు. నీ అందాన్ని నువు రాజకుమార్తెకు ధారపోసే పక్షంలో ఇందులో నిన్ను స్నానం చెయ్యనిస్తాను. అలా చేస్తే నా శాపానికి విఘ్నం ఉండదు, కాని నువు విరూపుడివై పోతావు. ఇష్టమేనా?" అన్నాడు ముని.





"ధన్యుణ్ణి, స్వామీ!" అని విజయుడు కొలనులో స్నానం చేసి, తన అందమంతా పోగొట్టుకుని రాజభవనానికి తిరిగివెళ్ళాడు.

రాజకుమార్తె తిరిగి ఎప్పటిలాగా కావటం చూసి తల్లి దండ్రులు అమితమైన ఆశ్చర్యమూ, ఆనందమూ పొందారు. ఇంతలోనే కురూపిగా మారిన విజయుడు వచ్చి, రాజకుమార్తెకు యథారూపం వచ్చినందుకు చాలా సంతోషించి, తాను చేసిన పని చెప్పాడు.

ఆ సమయంలో జయంతుడు జలంతో వచ్చి చేరి, "నా ప్రతిజ్ఞ నెరవేర్చాను. ఈ జలంతో రాజకుమార్తెకు యథారూపం ఇచ్చి, ఆమెను పెళ్ళాడతాను," అన్నాడు.

రాజకుమార్తె జయంతుడి ఎదటికి వచ్చి, "మీ శ్రమ వృథా అయింది. నాకు యథారూపం వచ్చేసింది," అన్నది.

తరవాత జగన్మోహినిని ఎవరు పెళ్ళాడాలన్న సమస్య వచ్చింది. వికారంగా ఉన్నప్పటికీ తాను విజయుణ్ణే పెళ్ళాడతానని జగన్మోహిని అన్నది. పడరాని పాట్లు పడి తాను పంచవర్ణ సంజీవి సరోవర జలం తెస్తే ఆమె తనను కాదనటం భావ్యం కాదన్నాడు జయంతుడు.

అప్పుడు మంత్రి కలిగించుకుని, "నువే న్యాయం చెప్పు, బాబూ! పంచవర్ణ సంజీవి సరస్సు ఎక్కడున్నదీ కూడా ఎవరికీ తెలియదుగదా, దాని నీరు నువు మూడో రోజుకల్లా తెచ్చావంటే నమ్మటం సాధ్యమేనా?" అన్నాడు.

"రాజకుమార్తె నన్ను పెళ్ళాడకపోతే మానెగాని, నేను మోసం చేశానన్నమాట మాత్రం పడను!" అని జయంతుడు తాను తెచ్చిన జలాన్ని విజయుడికి తాగమని ఇచ్చాడు.

విజయుడా నీరు తాగి తిరిగి యథారూపం పొందాడు. జయంతుడు అందరికేసీ విజయగర్వంతో చూసి, తన దేశానికి వెళ్ళిపోయాడు.

జగన్మోహినికీ, విజయుడికీ సక్రమంగా వివాహం జరిగింది.

# ప్రార్థనలు నమ్మినవాడు

ఒక గ్రామానికి కాటకం వచ్చింది. వానలు కురవలేదు. గ్రామస్థులంతా ఒక రోజు గుడికి వెళ్ళి వానల కోసం జపాలూ, హోమాలూ, ప్రార్థనలూ జరిపించ నిశ్చయించుకున్నారు.

ఆ రోజు ఉదయమే గ్రామస్థులంతా గుడికి బయలుదేరారు. వాళ్ళ వెంట ఒక చిన్న కుర్రవాడు గొడుగు చేత బట్టుకుని బయలుదేరాడు.

"గొడుగు దేనికి తెస్తున్నావురా? ఆకాశాన ఒక మబ్బుతునకైనా లేదే!" అన్నారు పెద్దవాళ్ళు వాడితో.

"ఇప్పుడు లేదనుకో. హోమాలూ, జపాలూ, ప్రార్థనలూ చెయ్యటం వల్ల వాన వస్తుంది గద. అప్పుడు మనం జోరున కురిసే వానలో ఇంటికి తిరిగి రావద్దా?" అన్నాడు కుర్రవాడు.

ఆ ఊరివాళ్ళలో ప్రార్థనలలో నిజమైన నమ్మకం ఉండినవాడు ఆ కుర్రవాడు ఒక్కడే.

—నూలు చెన్న కేశవులు





# మూర్ఖులు

హంగరీలోని ఒక గ్రామంలో ఒక కాపుకు మూర్ఖురాలైన భార్య ఉండేది. మూర్ఖత్వానికి తోడు ఆమెకు అంతులేని మొండితనం కూడా ఉండేది. తన భర్త ఏది చేసినా ఆమె తప్పు పట్టేది. అతను చేసే ప్రతి పనీ తాను ఇంకా బాగా చెయ్యగలనని ఆమె నమ్మకం.

ఒక ఏడు కాపు కోతలూ, నూర్పిళ్ళూ పూర్తి చేసి, ధాన్యాన్ని సంతకు తీసుకు పోయి వర్తకులకు అమ్మే ప్రయత్నంలో ఉండగా, అతని భార్య, "నీ కేమీ తెలీదు. నన్ను వెంట పెట్టుకుపోతే ధాన్యం మరింత బాగా అమ్మగలను," అన్నది.

"అయితే నువే వెళ్ళి అమ్ముకురా! నేను కూడా దేనికి?" అన్నాడు కాపు. ఆమె సరేనని, ధాన్యం మూటలు బండిలో వేసుకుని, ఇంటి పని చేసే కుర్రవాణ్ణి వెంట తీసుకుని బయలుదేరుతూ, "ధాన్యం ఏ ధరకు అమ్మాలి?" అని మొగుణ్ణి అడిగింది.

"ఆ మాత్రం తెలీదా? ఉన్న ధరకు అమ్ము," అన్నాడు భర్త.

కాపు భార్య సంతకు చేరింది. ఒక గడుసు వ్యాపారి ఆమె వద్దకు వచ్చి, "ధాన్యం ఎలా అమ్ముతున్నావు?" అని అడిగాడు.

"ఉన్న ధరకు అమ్ముతాను," అన్నది కాపు భార్య.

ఉన్న ధర కనుక్కు వస్తానని ఆ వ్యాపారి అవతలికి వెళ్ళి వచ్చి, "ఉన్న ధర ఏమిటంటే, సగం అప్పుగా ఇవ్వటమూ, మిగతా సగమూ వాయిదా మీద తీర్చటమూనూ," అన్నాడు.

"సరే, అలాగే అమ్ముతాను. కాని నాకు డబ్బు ఎప్పుడు చేతికి వస్తుంది?" అన్నది కాపు భార్య.

హంగరి జానపద కథ

''మళ్ళీ సంతనాడు,'' అన్నాడు వ్యాపారి.

''కాని మనం ఒకరినొకరు ఎలా పోల్చుకోవాలి?'' అన్నది కాపు భార్య.

''నా పాత కోటు నువు తీసుకుని, నీ ఉన్ని పచ్చడం నా కియ్యి. ఎవరి వస్తువులు వాళ్ళు గుర్తించటం తేలిక గద!'' అన్నాడు వ్యాపారి.

కాపు భార్య తృప్తిపడి తాను కప్పుకున్న పచ్చడంతోబాటు ధాన్యాన్ని వ్యాపారి పరం చేసి, వాడి పాత కోటు తీసుకుని దర్పంగా ఇంటికి తిరిగి వచ్చేసి, తాను చేసిన నిర్వాహకం గురించి గొప్పగా తన మొగుడికి చెప్పింది.

కాపు భార్య మీద మండిపడి, "ఛీ, మూఢులారా! నీలాంటి బుద్ధి తక్కువ మనిషి మరొకరు కనిపించిన దాకా ఇంటికి రాను,'' అంటూ ఇల్లు వదిలి బయలుదేరాడు. తన పెళ్ళాం కన్న మూఢులు ప్రపంచంలో ఉంటారని అతను నమ్మలేక పోయాడు. అతను నింపాదిగా నడుచు కుంటూ అడవి కుండా వెళ్ళేసరికి, ఒక ఇంటిలో దీపం వెలుగు కనిపించింది. అడవి మధ్య పాలాలూ, ఇళ్లూ ఉన్నాయి.

కాపు ఆ ఇంటి తలుపు తట్టేసరికి ఒక పయసు మళ్ళిన ఆడది తలుపు తెరిచి, ''ఎవరు, నాయనా? ఎక్కడి నుంచి వస్తున్నావు?'' అని అడిగింది.

ఈ మనిషి తెలివి తేటలు ఏ పాటివో తెలునుకుందామనుకుని కాపు, ఆమెతో, ''ఇప్పుడే పరలోకం నుంచి వస్తున్నాను,'' అన్నాడు.



ఆమె ఏమీ ఆశ్చర్యపడక, "అలా అయితే నా కొడుకు గాని నీకు తెలుసునా, నాయనా?" అని అడిగింది.

ఈ మనిషి మూఢత్వం ఎంతదూరం పోతుందో చూడాలనిపించి కాపు. "ఎరగకే మమ్మా? పాపం, అతను చింకి బట్టలు కట్టుకుని, ఎముకలూ, గుడ్డ పీలికలూ అమ్ముతూ, తన బండి తానే లాగుకుంటూ నానా అగచాట్లూ పడుతున్నాడు," అన్నాడు.

"అయ్యయ్యో! నువు మళ్ళీ అక్కడికి పోతున్నావా, నాయనా?" అన్నది ఆమె.

"అవునమ్మా, రేపు ఉదయానికి నేనక్కడ ఉండాలి," అన్నాడు కాపు.

"అయితే ఒక పని చేసిపెట్టు, బాబూ. పండక్కి చేసిన పెద్ద అప్పచ్చులు ఇంకా మూడు మిగిలి ఉన్నాయి. మా ఆయనకు తెలియకుండా దాచిన డబ్బు కొంత ఉన్నది. కొంచెం ఆగావంటే, మూడు బాతులు వండి ఇస్తాను. వాటిని తీసుకుపోయి మా వాడికి ఇయ్యి. అన్నట్టు మా ఆయన ఎవతెనో మోసం చేసి మంచి ఉన్ని పచ్చడం తెచ్చాడు. ఇది కూడా మా అబ్బాయికి ఇయ్యి," అన్నది ఆ ఇల్లాలు.

అనుకోకుండా రావలసిన చోటికే వచ్చాను గదా అనుకున్నాడు కాపు. ఇంటి ఆవిడ వంట చేస్తున్నంతసేపూ అతను విశ్రాంతి తీసుకుని, వంట పూర్తి కాగానే ఆవిడ ఇచ్చిన వస్తువులన్నీ పుచ్చుకుని, తన కొడుకు బండి కోసం ఆమె ఇచ్చిన గుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు.



అతను వెళ్ళాడో లేదో ధాన్యం వ్యాపారి ఇల్లు చేరుకున్నాడు. ఆయన భార్య జరిగిన దంతా చెప్పింది. వ్యాపారి నెత్తీ నోరూ బాదుకుని, పెళ్ళాన్ని తిట్టి పరిగెత్తుతూ ఇంటి నుంచి బయలుదేరాడు.

తన వెనకగా ఎవరో పరిగెత్తుకుంటూ వస్తున్న సంగతి పసిగట్టి కాపు, తన గుర్రాన్ని అడవి లోపలికి తీసుకు పోయి, ఒక చెట్టుకు కట్టేసి, తాను మళ్ళీ దారి పక్కకు వచ్చి, ఒక ఒరిగి పోయిన చెట్టుకు భుజం పోటీ పెట్టిన వాడిలాగా నిలబడ్డాడు.

వ్యాపారి అతన్ని చేరవచ్చి, "ఇటుగా గుర్రం మీద ఎవరైనా వెళ్ళాడా?" అన్నాడు.

"వెళ్ళాడు. కాని నువు వాడి జోలికి పోకు. వాడు బలాఢ్యుడు," అన్నాడు కాపు.

"నీ కన్న బలం గలవాడా?" అని వ్యాపారి అడిగాడు.

"కాదు," అన్నాడు కాపు.

"నువు వెళ్ళి, వాణ్ణి కాస్త పట్టుకు పద్దూ! నీకు డబ్బు ఇచ్చుకుంటాను," అన్నాడు వ్యాపారి.

"నేను ఎలా వెళ్ళేది? ఈ చెట్టును పడి పోకుండా నిలపక పోతే మా కుటుంబం సర్వనాశనమవుతుంది. అది ఒక శాపం," అన్నాడు కాపు.

"నువు తిరిగి వచ్చేదాకా ఈ చెట్టు పడ కుండా నేను చూస్తానులే. ఆ వెధవను త్వరగా పట్టుకురా! వాడు నా పెళ్ళాన్ని మోసం చేసి చాలా కాజేశాడు," అంటూ ధాన్యం వ్యాపారి చెట్టుకు తన భుజం పోటీ పెట్టాడు.

కాపు తన గుర్రాన్ని విప్పి, దాని మీద తన ఇంటికి తిన్నగా వెళ్ళి పోయి, తన భార్యతో, "నీ కన్న బుద్ధి తక్కువ వాళ్ళింకా ఉన్నారు గనక ఇంటికి తిరిగి వచ్చాననుకో!" అన్నాడు.

"నేను ఎప్పుడో నీకు ఆ మాట చెప్పాను. ఈ లోకంలో నేనొక్కతెనే బుద్ధి తక్కువ దాన్నయినట్టు మాట్లాడతావు," అన్నది కాపు భార్య.

"ఆ మాట బుద్ధిగానే అన్నావు," అనుకున్నాడు కాపు.





# అబూసీర్

## 3

కలంకారీవాడు తన సొత్తు కాజేసి తనను విడిచిపెట్టిపోయాక, అబూ సీర్ మూడు రోజులపాటు స్పృహ లేకుండా పడి ఉన్నాడు. ఈ మూడు రోజులూ కూడా ఎవరూ గది నుంచి బయటికి రాలేదు, గదిలోకి పోలేదు అది గమనించి సత్రం దర్వాను, "వీళ్ళు డబ్బు ఇవ్వకుండా పారిపోలేదుగద? లేక ఇద్దరూ చచ్చిపోయారా?" అనుకుని, గది తలుపు తోసి, గదిలోకి వచ్చి, పాలిపోయి చావటానికి సిద్ధంగా ఉన్నట్టున్న మంగలి అబూ సీర్‌ను చూశాడు. అబూ సీర్ మూలుగుతున్నాడు.

"అన్నా, నీకేం వచ్చింది? రెండోవాడు ఎక్కడ?" అని దర్వాను అబూసీర్‌ను అడిగాడు.

"నాకేం వచ్చిందో అల్లాకే తెలియాలి. నా కిప్పుడే స్పృహ తెలిసింది. ఎంత కాలంగా పడి ఉన్నానో ఏమో తెలీదు. చాలా దాహంగా ఉంది. నా డబ్బు సంచీలో నుంచి డబ్బులు తీసుకుని నా కేమన్నా తెచ్చి పెట్టు," అన్నాడు అబూ సీర్ బలహీనంగా.

దర్వాను సంచీని గాలించి చూసినా అందులో ఏమీలేదు. మంగలివాణ్ణి రెండోవాడు దోచాడని అర్థం చేసుకుని దర్వాను, "నీ తిండి విషయం బెంగ పెట్టుకోకు. నిన్ను నేను చూసుకుంటాను," అని, ఇంత జావ కాచి తెచ్చి, తానే అబూ సీర్ చేత తాగించి, కంబళి కప్పాడు.

అలా ఆ పుణ్యాత్ముడు రెండు నెలలపాటు తన సొంత డబ్బు ఖర్చు చేసి, అబూ సీర్‌ను సంరక్షించాడు.

చివరకు దైవానుగ్రహం వల్ల అబూ సీర్ కోలుకుని, లేచి కూర్చున్నాడు.

అరేబియన్ కథ



"అల్లా అనుగ్రహం ఉండాలేగాని, నువు నాకు చేసిన మహోపకారానికి తగిన ప్రత్యుపకారం చేస్తాను. కాని నీ ఋణం పూర్తిగా తీర్చగలవాడు ఆ భగవంతుడు ఒక్కడే!" అన్నాడు అబూ సీర్ స్నానం దర్వానుతో.

"నువు బతికి బయట పడటమే అల్లా అనుగ్రహం అనుకో," అన్నాడు దర్వాను.

అబూ సీర్ తన మంగలి పొది తీసుకుని నగరంలోకి బయలుదేరాడు. అతను అనుకో కుండా అబూ కీర్ నడిపే కలంకారీ కార్ఖానా వద్దకే వచ్చాడు. అక్కడ అరగట్టి ఉన్న రంగురంగుల బట్టలను వింతగా చూస్తూ చాలా పెద్ద గుంపు చేరి ఉన్నది.

"ఇంతమంది ఇక్కడ చేరారు, కారణం ఏమిటి?" అని అబూ సీర్ అక్కడ ఉన్న వాళ్ళను అడిగాడు.

"ఇది ఆస్థాన కలంకారీ నిపుణుడు అబూ కీర్ దొరగారి కార్ఖానా. ఇక్కడ ఆయన ఎవరికీ తెలియని రహస్యప్రయోగాలు చేసి బట్టలకు ఈ వింత రంగులన్నీ వేస్తాడు," అన్నాడు ఒక మనిషి.

తన మిత్రుడు బాగుపడ్డాడని తెలిసి అబూ సీర్ హృదయం పొంగి పోయింది. "దేవుడి అనుగ్రహం ఉండి అతను పైకి వచ్చాడు. నేను అతన్ని గురించి చెడుగా అనుకున్నది తప్పు. పని తొందర వల్లనే అతను నన్ను వదిలిపెట్టి పోవటమూ, మరిచి పోవటమూ జరిగి ఉంటుంది. నా డబ్బు తీసుకుపోవటం కూడా రంగులు కొనటానికే అయి ఉంటుంది. అతను నన్ను చూసి పరమానందం చెంది, నేను చేసిన సహాయానికి పదింతలు సహాయం చేస్తాడు," అనుకున్నాడు అబూ సీర్.

అతను గుంపు మధ్యగా దారి చేసుకుంటూ వెళ్ళి, కార్ఖానా తలుపు తోసి లోపలికి చూశాడు. అబూ కీర్ ఒక ఎత్తయిన మంచం మీద బాలీసుల పైన బద్ధకంగా పడుకుని ఉన్నాడు. అతను ధరించిన దుస్తులు రాజులు ధరించదగినవిగా ఉన్నాయి. అతని వెనకగా నలుగురు నల్ల

బానిసలూ, నలుగురు తెల్లబానిసలూ మంచి దుస్తులు ధరించి నిలబడి ఉన్నారు. ఇద్దరు పనివాళ్ళు తొట్టెల వద్ద పని చేస్తున్నారు. వాళ్ళు ఏమి చెయ్యవలసినదీ అబూ కీర్ సంజ్ఞల ద్వారా చెబుతున్నాడు.

అబూ సీర్ లోపలికి వెళ్ళి తన మిత్రుడి ఎదట నిలబడి, అతను తనకేసి చూసి నప్పుడు పలకరిద్దామనుకున్నాడు; తనను చూస్తూనే అతను వచ్చి కౌగలించుకుంటా డనుకున్నాడు.

కాని, అబూ కీర్ అబూ సీర్‌ను చూస్తూనే, చివాలున లేచి, "దొంగ వెధవా! నా దుకాణం చాయలకు రావద్దని ఎన్నిసార్లు చెప్పాను? నన్ను సర్వనాశనం చేసి, అప ఖ్యాతి తీసుకు రాదలచావా? ఒరే, వాణ్ణి పట్టుకోండి!" అని అరిచాడు.

వెంటనే తెల్ల బానిసలూ, నల్ల బానిసలూ అబూ సీర్‌ను పట్టుకుని, పడదోసి, మీద ఎక్కి తొక్కారు. అబూ కీర్ దుడ్డుకర్ర తీసుకుని, "వాణ్ణి బోర్లా పడుకోబెట్టండి," అన్నాడు. అబూ సీర్ వీపుమీద నూరు దెబ్బలు కొట్టి, వెల్లికిలా తిప్పించి, పొట్ట మీద మరో నూరు దెబ్బలు కొట్టి, "పో, మాయదారి ముండాకొడకా! ఈసారి నీ ముఖం చూపిం చావంటే నిన్ను రాజుగారి వద్దకు పంపి, నీ చర్మం ఒలిపించి, కోటబయట కొరత వేయిస్తాను! పాపిష్టి ముఖమా!" అన్నాడు.




శరీరమూ, మనస్సూ కూడా గాయపడి, బాధతో ఏడుస్తూ అబూ సీర్ కాళ్ళీడ్చు కుంటూ బయటికి వెళ్ళాడు. బయట మూగిన జనం అతన్ని నానా తిట్లూ తిట్టారు.

అతను తన గదికి తిరిగి వచ్చి, చాప మీద పడుకుని, అబూ కీర్ దుష్ప్రవర్తన గురించి తెల్లవార్లూ ఆలోచించాడు. మర్నాడు ఉదయానికి దెబ్బల బాధ కాస్త తగ్గింది. అతను లేచి స్నానశాలకు బయలుదేరాడు.

అతను వీధిలోకి వచ్చి, దారేపోయే వాణ్ణి, "స్నానశాలకు దారి ఎటు, బాబూ?" అని అడిగాడు.

"స్నానశాల అంటే ఏమిటి?" అని ఆ మనిషి ఎదురు అడిగాడు.

"స్నానం చేసి, వంటి మురికి వదిలించుకునే చోటు. ప్రపంచంలో అంతకన్న సుఖప్రదమైన చోటు ఉండదుగద," అన్నాడు అబూ సీర్.

"వెళ్ళి, సముద్రంలో స్నానం చెయ్యి. అందరూ అక్కడే స్నానం చేస్తారు," అన్నాడు ఆ మనిషి.

ఆ నగరంలో వాళ్ళకు స్నానశాల సౌకర్యాలు ఏమిటో తెలియదని అబూ సీర్ త్వరలోనే గ్రహించగలిగాడు.

అతను తిన్నగా రాజభవనానికి వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, నేను పరదేశీని. వృత్తిచేత మంగలిని. కాని నాకు ఇతర విద్యలు తెలుసు. నీరు కాస్తాను. ఒళ్ళు పట్టుతాను. ఇవాళ నేను తమ నగరంలో స్నానశాలకు వెళదామనుకుంటే, ఎవరికీ స్నానశాల అనేమాటే తెలియులేదు. ఇంత మహానగరానికి స్నానశాల లేకపోవటం ఆశ్చర్యకరం. అది భూలోకస్వర్గం అన్నమాట," అన్నాడు.

"నువు చెప్పే ఈ స్నానశాల ఎటువంటిది? నేనా పేరైనా ఎన్నడూ వినలేదే!" అన్నాడు రాజు.

స్నానశాల నిర్మాణం ఎలా ఉంటుందో, అందులో స్నానాలు చేసేవారికి ఏయే సదుపాయాలు ఉంటాయో, అబూ సీర్ వివరంగా రాజుగారికి చెప్పాడు. అంతా చెప్పి, "మహారాజా, ఈ విషయాలు అనుభవించవలసినవి గాని, వర్ణించేవి కావు. వర్ణిస్తే అర్థమయేవి కూడా కావు. స్నానశాలే ఉంటే



ఈ నగరానికి వంక పెట్టటానికి ఉండదు,'' అన్నాడు.

ఈ మాట విని రాజుగారికి మహదానంద మయింది.

''ఏ తల్లి కన్నవాడివో, నీకు స్వాగతం,'' అంటూ ఆయన అబూ సీర్‌కు తన చేత్తో శాలువ కప్పి, ''నువ్వు ఎలా చెయ్యమంటే అలా జరిపిస్తాను. నువ్వు మాత్రం త్వరలోనే స్నానశాల నిర్మించు. నాకు దాని ఆనందం అనుభవించాలని ఉన్నది,'' అన్నాడు.

ఆయన అబూ సీర్‌కు ఇద్దరు నీగ్రోలనూ, ఇద్దరు కుర్రవాళ్ళనూ, నలుగురు యువతులనూ, ఒక గుర్రాన్ని, ఒక దివ్యమైన భవంతినీ ఇప్పించాడు. కలంకారీవాడి కిచ్చిన సౌకర్యాలకన్న ఎక్కువే అబూ సీర్‌కు లభించాయి. అబూ సీర్ నిర్ణయించిన చోట స్నానశాల కట్టటానికి ఆస్థానంలోని తాపీవాళ్ళూ, తదితరులూ నియోగించబడ్డారు. వారిని వెంటబెట్టుకుని అబూ సీర్ నగరమంతా తిరిగి, తగిన చోటు నిర్ణయించాడు. అక్కడ అతని పర్యవేక్షణ కింద, ప్రపంచంలో ఎక్కడా లేనటువంటి అద్భుత స్నానశాల నిర్మాణమయింది. స్నానశాల అంతటా అందమైన నగిషీలూ, రంగు రంగుల పాలరాతి పలకల గళ్ళూ అమర్చారు.

స్నానశాల నిర్మాణం పూర్తికాగానే అబూ సీర్ రాజు వద్దకు వెళ్ళి, ''మహారాజా, స్నానశాల తయారయింది. సరంజామా ఏర్పాటు మాత్రమే మిగిలి ఉన్నది,'' అన్నాడు.





రాజు అందుకుగాను పది వేల దీనారాలు మంజూరు చేశాడు. అబూ సీర్ ఆ డబ్బుతో తువాళ్లూ, వస్త్రాలూ, సెల్కులూ, అత్తరులూ, సుగంధద్రవ్యాలూ, మొదలైనవి కొని, ఎక్కడ అమర్చవలసినవి అక్కడ అమర్చాడు.

అబూ సీర్ ఈ ఏర్పాట్లు పూర్తిచేసి రాజు వద్దకు వెళ్ళి, బలిష్ఠులైన పదిమంది మనుషులను ఒళ్ళు పట్టటానికి ఇవ్వమన్నాడు. రాజుగారు ఇరవై మంది కండలు తిరిగిన యువకులను ఇచ్చాడు. అబూ సీర్ వాళ్లకు ఒళ్ళు పట్టటం ఎలాగో, స్నానం చేయించటం ఎలాగో తాను వారికి చేసి చూపి, తాను వారిచేత చేయించుకుని, ఆ విధంగా వారిని తరిఫీదు చేశాడు.

అబూ సీర్ స్నానశాలను ప్రారంభించటానికి ఒక రోజు నిర్ణయించి, ఆ విషయం రాజుగారికి విన్నవించాడు.

ఆ రోజున అబూ సీర్ స్నానశాల నిండా సుగంధమూ, ధూపాలూ వేసి, నీరు కాచి, కొలనులలో నీటి కొళాయిలు తిప్పి సిద్ధంగా ఉంచాడు. స్నానశాల అంతా కడిగిన ముత్యంలాగా ఉన్నది. రాజుగారు తన మంత్రులతోనూ, పరివారంతోనూ స్నానశాలలోకి అడుగు పెడుతూనే తన్మయత్వం చెందాడు. సువాసనలూ, సుందర నిర్మాణమూ, కొళాయిలలో నీరు చేసే ధ్వనులూ ఆయనను ముగ్ధుణ్ణి చేశాయి.

"ఏమిటిదంతా?" అన్నాడాయన.

"ఇదే స్నానశాల, మహారాజా! కాని తమరింకా ద్వారం దగ్గిరే ఉన్నారు," అంటూ అబూ సీర్ ఆయనను మొదటి హాలులోకి తీసుకుపోయి, దిమ్మె మీదికి ఎక్కించి, ఆయన బట్టలు విప్పి, తువాలు చుట్టి, ఆయన కాళ్ళకు కొయ్యచెప్పులు తొడిగి, ఆయనను రెండో హాలులోకి తీసుకుపోయాడు. అక్కడ రాజుగారికి చెమట పట్టించి, శరీరమంతా యువకులచేత బలంగా రుద్దించాడు. తరవాత ఆయన శరీరమంతా కడిగి, ఆయనను కొలనులోని పన్నీటిలో కొంతసేపు ఉండనిచ్చి, తరవాత శరీరానికి జాజిఅత్తరూ, ఇతర అత్తరులూ



పట్టించి, ఒంటికంతకూ ముసాంబరం, సాంబ్రాణి ధూపాలు వేశాడు.

రాజుగారికి తన ఒళ్ళు గాలిలో తేలిపోగల దన్నంత తేలిక అయినట్టు తోచింది. చర్మం నున్నగా, గచ్చులాగున్నది. ఆయనకు ఎక్కడలేని జవసత్వాలూ వచ్చినట్టు అనిపించింది.

"యా అల్లా! ఇటువంటి అనుభవం ఎన్నడూ ఎరగను. ఇదా స్నానశాల అంటే?" అన్నాడు రాజు.

"అవును, మహారాజా!" అన్నాడు అబూ సీర్.

"నా నగరం ఈనాడు నిజంగా నగరం అనిపించుకున్నది," అన్నాడాయన.

"ఈ స్నానం విలువ ఎంత అంటావు? నువు ఎంత అడుగుదామనుకుంటున్నావు?" అని రాజుగారు అబూ సీర్‌ను అడిగాడు.

"తమ దయ," అన్నాడు అబూ సీర్.

"అలా అయితే ఈ స్నానం విలువ వెయ్యి దీనారాలు అంటాను. అంతకన్న తగ్గటానికి వీల్లేదు," అన్నాడు రాజుగారు. ఆయన అబూ సీర్ చేతిలో వెయ్యిదీనారాలు పెడుతూ, "ఇంతకన్న తక్కువ మొత్తానికి ఎవరికీ స్నానం చేయించకు," అన్నాడు.

"క్షమించండి, మహారాజా. ధనికులుంటారు, పేదలుంటారు. ప్రతి ఒకడూ వెయ్యి దీనారా లివ్వాలని నియమం పెడితే త్వరలోనే ఈ స్నానశాలను మూయవలసి వస్తుంది," అన్నాడు అబూ సీర్.

"అయితే నువు ఎంత ఏర్పాటు చేస్తానంటావు?" అని రాజు అడిగాడు.

"ఎవరి తాహతుకు తగ్గట్టు వారు ఇస్తారు. వెయ్యి దీనారా లంటే అది మహారాజులు ఇవ్వతగినది," అన్నాడు అబూసీర్.

అతని అభిప్రాయానికి రాజు వెంట వచ్చిన వారందరూ హర్షించారు.

"అతను చెప్పినది సబబుగా ఉన్నది, మహారాజా. అందరికీ తమలాంటి ఈవి ఎలా వస్తుంది?" అన్నారు వాళ్ళు రాజుతో.

"అదంతా నిజమే కావచ్చు. ఏమైనా, ఇతను ఎక్కడినుంచో వచ్చిన పేదవాడు.

ఇతన్ని సంపన్నుణ్ణి చెయ్యటం మన ధర్మం. మన నగరానికి ఈ అద్భుతమైన స్నానశాల ఇచ్చాడు. మీరందరూ ఒక్కొక్క స్నానానికి వెయ్యేసి దీనారాలు ఇవ్వలేని పక్షంలో ఈసారికి నూరేసి ఇస్తూ, ఒకరిద్దరు బానిసలను కూడా ఇవ్వండి. తరవాత, అతను కోరినట్టు, మీమీ శక్తికొద్దీ ఇద్దురుగాని," అన్నాడు రాజు.

రాజుగారి వెంట నలభైమంది వచ్చారు. వారందరూ స్నానాలు చేసినాక అబూ సీర్ నాలుగు వేల దీనారాలనూ, నలభై తెల్లా బానిసలనూ, నలభై నీగ్రో బానిసలన్నూ, నలభై మంది స్త్రీలనూ సంపాదించుకున్నాడు. రాజుగారు ప్రత్యేకంగా పది వేల దీనారాలనూ, పది మంది తెల్ల బానిసలనూ, పదిమంది నీగ్రోలనూ, పదిమంది స్త్రీలనూ బహూకరించాడు.

అబూ సీర్ రాజుగారికి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి, "మహారాజా, ఈ బానిసలనూ, ఆడవాళ్ళనూ ఎక్కడ ఉంచను?" అన్నాడు.

"నిన్ను సంపన్నుణ్ణి చెయ్యటానికి ఈ పరిచారకులను ఇప్పించాను. నువు రేపు మీ దేశానికి తిరిగి పోయినప్పుడు వీళ్ళు నీకు సేవలు చేస్తారు. వీళ్ళు నీ సంపద," అన్నాడు రాజు.

"మహారాజా, ఇంతమంది సేవకులు తమవంటి ప్రభువులకు చెల్లుతుందిగాని, నాకు పరిచారకులు అవసరం లేదు. మాది సాదా సంసారం. నేను వీరికి తిండీ, బట్టా ఎక్కడి నుంచి తెచ్చేది?" అన్నాడు అబూ సీర్.

రాజు విరగబడి నవ్వి, "అది నిజమే," అన్నాడు. ఆయన ఆ బానిసలందరినీ తలకు నూరేసి దీనారా లిచ్చి తానే కొనుక్కున్నాడు. ఖజానాదారు నూటయాభై మంది బానిసలకూ డబ్బు చెల్లించాడు.

రాజుగారు పరివారంతో సహా వెళ్ళిపోయాక, ధనమంతా తన ఇంటికి తీసుకుపోయి, దీనారా లన్నిటినీ సంచులలో నింపి కుట్టేసి, ఆ సంచులను భద్రంగా దాచుకున్నాడు అబూ సీర్. —(ఇంకా వుంది)





# న్యాయదేవత

చీనాదేశంలో చాంగ్ అనే యువకుడు ఉండేవాడు. అతను పేదవాడు. తల్లిదండ్రులను చిన్నతనంలోనే పోగొట్టుకుని చాంగ్ ఆ పనీ, ఈ పనీ చేసుకుని పొట్ట పోసుకుంటూ, తన తండ్రి మిగిల్చిపోయిన ఇంటిలోనే ఉంటున్నాడు.

చాంగ్ ఇంటి సమీపంలోనే ఒక వ్యాపారస్థుడు ఉండేవాడు. తల్లిదండ్రులు లేని చాంగ్‌ను తన కింద నౌకరీకి పెట్టుకుని, ఏదో వంక పెట్టి చాంగ్ ఉంటున్న ఇల్లూ, స్థలమూ కాజెయ్యాలని వ్యాపారి ఎంతో ప్రయత్నించాడు. కాని చాంగ్ వ్యాపారి బుద్ధి బాగా తెలిసిన వాడు కావటం చేత ఆయన కింద పని చెయ్యటానికి ఒప్పుకోలేదు.

చాంగ్ గృహదేవత "టోంగో". ఆమె చీనా వాళ్ళ న్యాయదేవత. చాంగ్ పనికి బయలుదేరే ముందు రోజూ ఎంతో భక్తి శ్రద్ధలతో "టోంగో" విగ్రహానికి దణ్ణం పెట్టుకునేవాడు.

యుక్త వయస్కుడయే నాటికి చాంగ్ చాలా డబ్బు కూడ బెట్టాడు. ఆ కుర్రవాడు ఎప్పుడూ ఆనందంతోనూ, ఉత్సాహంగానూ ఉండటం గమనించి వ్యాపారి అసూయ పడ్డాడు. చాంగ్ ఆనందోత్సాహాలకు కారణం ఏమిటో తెలుసుకోవాలని వ్యాపారికి బుద్ధి పుట్టింది. ఒక రాత్రి ఆయన చాంగ్ ఇంటిని సమీపించి, కిటికీలో నుంచి తొంగి చూసి, నిర్ఘాంతపోయాడు.

చాంగ్ పక్కన ఒక పెద్ద పెట్టె ఉన్నది. చాంగ్ బంగారు నాణాలు ఎంచి అందులో పోస్తున్నాడు. తరవాత అతను తన జేబులో నుంచి కొన్ని చిల్లర నాణాలు తీసి, వాటిని కూడా పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను భూమిలో పెట్టి, పైన ఒక కొయ్యపలక కప్పి, ఆ పలక మీద "టోంగో" విగ్రహాన్ని, పూజాసామగ్రినీ

సి. ఆదినారాయణ



అమర్చి. ఆ సమీపంలోనే పక్క వేసుకుని పడుకున్నాడు.

ఇదంతా కళ్ళారా చూసి తన ఇంట్లోకి తిరిగి వచ్చిన వ్యాపారికి ఆ రాత్రి కన్ను మూత బడలేదు. "కుర్రకుంక ఎంత బంగారం పోగుచేసి దాచాడూ! దాన్ని ఏ విధంగానైనా సరే కాజేయాలి," అనుకున్నాడు ఆయన.

మర్నాడు చాంగ్ పనికి వెళ్ళగానే వ్యాపారి ఎలాగో చాంగ్ ఇంట ప్రవేశించి, టొంగో విగ్రహాన్ని పక్కకు జరిపి, పలక ఎత్తి, గుంటలో ఉన్న పెట్టె తెరిచి, అందులో ఉన్న బంగారం తీసి తన సంచీలో వేసుకుని, పెట్టె మూసి, పైన పలకా, దాని మీద విగ్రహమూ ఎప్పటిలాగే పెట్టేసి తన ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చాంగ్ ఇంటికి తిరిగి వచ్చి చూసుకుంటే బంగారం లేదు. చాంగ్ చాలా దిగులుపడ్డాడు. బాగా ఆలోచించి చూడగా, తన బంగారం దొంగిలించిన వాడెవడో తనకు తెలిసినవాడే అయి ఉంటాడని అతనికి అనిపించింది.

తెల్లవారగానే చాంగ్ న్యాయాధికారి వద్దకు వెళ్ళి, జరిగినది చెప్పి, తన సొమ్ము తనకు తిరిగి వచ్చేటట్టు చూడమని వేడుకున్నాడు.

న్యాయాధికారి చాంగ్‌ను పంపేసి, చాలా సేపు ఆలోచించిన మీదట ఆయనకు వ్యాపారి మీదనే అనుమానం కలిగింది. ఏమయినా దొంగను పట్టుకోవలసిన బాధ్యత తన పైన ఉన్నది గనక, రాత్రిళ్ళు చాంగ్ ఇంటి వద్ద రహస్యంగా కాపలా కాయటానికి ఆయన ఒక మనిషిని పెట్టాడు.

రెండు రోజులపాటు చాంగ్ ఇంటి చాయలకు ఎవరూ రాలేదు. కాని మూడో రోజు రాత్రి వ్యాపారి చాంగ్ ఇంటిని సమీపించి, కిటికీలో నుంచి తొంగి చూడటం కాపలావాడి కంటపడింది. ఈ మాట కాపలా వాడు పరిగెత్తుకువచ్చి చెప్పగానే న్యాయాధికారికి వ్యాపారి మీదవున్న అనుమానం రూఢి అయింది.

ఇక వ్యాపారిని దొంగగా పట్టుకోవటం మాత్రమే మిగిలి ఉన్నది. అందుకు గాను న్యాయాధికారి ఒక ఉపాయం ఆలోచించి, దాన్ని చాంగ్‌కు కూడా చెప్పాడు.

నాలుగో రోజు రాత్రి వ్యాపారి వచ్చి కిటికీలో నుంచి చ్యాంగ్ ఇంట్లోకి తొంగి చూసేసరికి ఒక విచిత్రమైన దృశ్యం కని పించింది.

కిటికీకి వీపు పెట్టి ఒక స్త్రీ నిలబడి ఉన్నది. ఆమెకు ఎదురుగా చాంగ్ మోక రించి కూర్చుని నమస్కరిస్తున్నాడు. ఆ స్త్రీ చాంగ్‌తో, "నాయనా, నీకు నా మీద గల భక్తి నాకు తెలుసు. ఎన్నో తరాలుగా మీ వంశం వాళ్ళు నన్ను పూజిస్తూ వస్తు న్నారు. నీకు ఘోరమైన అన్యాయం జరిగి పోయింది. నీ సొమ్ము దొంగిలించిన వాడె వరో నాకు తెలుసు. వాడు దొంగిలించిన వెయ్యి బంగారు నాణాలూ నీకు ఇప్పి స్తాను," అన్నది.

ఈ దృశ్యం చూస్తూ మాటలు వింటున్న వ్యాపారి ఆశ్చర్యంగా, "వెయ్యి నాణాలా! నూరేనే? నేను లెక్క పెట్టానే?" అని పైకే అంటూ తన ఇంట్లోకి పరుగు తీసి, తాను కాజేసిన బంగారం ఉన్న సంచీ పైకి తీసి, బంగారు నాణాలను మళ్ళీ లెక్క పెట్టసాగాడు.

అతను అలా లెక్క పెట్టుతుండగా న్యాయాధికారి పదిమంది భటులతో సహా వచ్చి, వ్యాపారిని బంధించి, వ్యాపారి చేత నేరం ఒప్పించి, వ్యాపారికి మూడు నెలల కారాగార శిక్ష విధించి, చాంగ్ సొమ్ము చాంగ్‌కు ఇప్పించాడు.

ఈ సంఘటనతో న్యాయాధికారి ప్రతిష్ఠ పెరిగింది. టొంగోదేవత న్యాయాధికార్లకు ప్రత్యక్షమై సహాయ పడుతుందని ఒక నమ్మకం చీనాలో ఉండేది. కాని అలాటి న్యాయాధికారిని చూసిన వాళ్ళు మాత్రం ఎవరూ లేరు.

ఈ న్యాయాధికారికి టొంగోదేవత సహాయం ఉన్నదని ఒక విశ్వాసం ప్రజ లలో వ్యాపించింది. ఆయన హయాంలో అన్యాయాలు బాగా తగ్గాయి.



# వృత్తికి తగిన వేషం

ఒక పట్టణంలో ఒక బిచ్చగాడు ఉండేవాడు. వాడు నాలుగు వీధులూ తిరిగి బిచ్చం అడుక్కుని, తన పొట్ట పోసుకుంటూ ఉండేవాడు.

ఒకనాడు ఒక వీధిలో ఒక దయాపరుడు ఆ బిచ్చగాడి అవతారం చూసి జాలిపడి, ఒక మంగలిని పిలిచి బిచ్చగాడి గడ్డం గీయించి, వాడిచేత చక్కగా స్నానం చేయించి, కట్టుకోవటానికి ఇస్త్రీ బట్టలు ఇచ్చి, కడుపునిండా భోజనం పెట్టి పంపేశాడు. బిచ్చగాడికి ఆ రోజు సుఖంగా గడిచింది.

కాని మర్నాడు వాడు ఇస్త్రీబట్టలు కట్టుకుని మామూలు ప్రకారం బిచ్చం అడుక్కుంటూ బయలుదేరితే, అందరూ వాణ్ణి ఎగా దిగా చూసి, "చక్కగా ముస్తాబై అడుక్కుంటున్నావా? నీకు సిగ్గులేదూ? నీకేమన్నా కాలు వంకరా? చెయ్యి వంకరా? కూలో నాలో చేసుకు బతకలేవూ?" అని కసరి, బిచ్చం వేశారుకారు.

జరిగిన పొరపాటు గ్రహించి బిచ్చగాడు ఇస్త్రీబట్టలు విడిచిపెట్టి, తన మామూలు బట్టలు వేసుకుని, మళ్ళీ గడ్డం మాయనిచ్చి, యథా ప్రకారం బిచ్చం ఎత్తసాగాడు. వాడికి బిచ్చం దొరికింది.

—చిన్నారి చిన్నికృష్ణ.





# అసంతుష్టి

పూర్వం వింధ్యపర్వత ప్రాంతంలో గంధర్వులు నివాసం చేసే కాలంలో కందర్పకం అనే చిన్న దేశాన్ని కువలయుడు అనే రాజు పాలించేవాడు. అతనికి పశుసంపదా, భూసంపదా కొల్లగా ఉండేది.

కువలయుడు ఒకనాడు వేటకువెళ్ళి ఒక కోనలో వేటాడుతూ ఉండగా ఒక గుట్టమీద ఒక అద్భుత సౌందర్యవతి కనిపించింది. అతను ఆమెను చూస్తూనే మోహించి, చెయ్యెత్తి ఆమెను కొండ దిగి రమ్మని పిలిచాడు. ఆమె రానన్నట్టు చెయ్యి ఊపి, గుట్ట దిగి వెళ్ళిపోసాగింది. కువలయుడు అతివేగంగా గుట్ట ఎక్కి అవతలి పక్కకు పోయి అంతటా కలయజూశాడు, కాని ఆమె జాడ లేదు.

ఆమెను ఎలాగైనా ఒప్పించి, తనకు భార్యగా చేసుకోవాలని కువలయుడికి బలమైన కోరిక కలిగింది. అతను మర్నాడు అదే కోనకు వెళ్ళాడు. ఆమె మళ్ళీ కనిపించింది, కాని అతను సమీపించే లోపల ఎటో వెళ్ళిపోయింది.

ఆమె గంధర్వ స్త్రీ అయివుంటుందనీ, ఆమె ఎలాటి నిబంధనలు పెట్టినా ఒప్పుకుని ఆమెను పెళ్ళాడాలనీ కువలయుడు నిశ్చయించుకుని మూడోనాడు అదే ప్రాంతానికి వెళ్ళాడు. ఆమె కనబడింది. అతను ఆమెను సమీపించాడు. ఈసారి ఆమె వెళ్ళి పోక, అతను సమీపించగానే, "నా పేరు మలయవతి. రోజూ ఇలా నా వెంట ఎందుకు పడుతున్నావు?" అని అడిగింది.

"నిన్ను పెళ్ళాడకపోతే నా జన్మ నిరర్థకమనిపిస్తున్నది. నా వెంట మా యింటికి వచ్చి, నాకు భార్యవుగా ఉండు," అన్నాడు కువలయుడు.

"సరే," అన్నది మలయవతి. కువలయుడు సంతోషంగా ఆమెను తన ఇంటికి

ఎ. పుండరీకాక్షయ్య



తెచ్చి, వివాహం చేసుకుని, ఆమెతో కాపరం చేయ సాగాడు. మలయవతి వచ్చిన తరవాత అతని పశుగణాలు రెట్టింపు అయాయి, భూములు రెట్టింపు పంట ఇచ్చాయి. కువలయుడు చాలా సంతోషించాడు. అతను ఎవరేది అడిగినా ఇచ్చేవాడు, ఎంతదానం చేసినా అతన్ని ప్రజలు ఏమంత మెచ్చేవారు కారు: "ఈ దానాలు ఆయనకో లెక్కా? ఇంతకు నూరింతలు అవతలినించి వస్తూనే ఉంటుంది. దేవతను పెళ్ళాడాడుగా!" అనేవారు.

కొన్ని సంవత్సరాలు గడిచింది. కువలయుడికి జీవితం మీద కొంత ఏవగింపూ, అసంతృప్తి కలగసాగింది. తాను మహా సంపన్నుడు. చుట్టుపక్కల రాజులు అతన్ని చూసి అసూయపడుతున్నారు. కాని ఇదంతా పాతకథ అయిపోయింది. మలయవతి ఇప్పటికీ అద్భుత సౌందర్యవతిగానే ఉన్నది గాని, ఆమె ఇప్పుడు దేవతకాదు, మామూలు స్త్రీయే.

కువలయుడు ఇలా అనుకుంటూ తన పొలాల వెంబడి నడుస్తూ ఉండగా అతనికి రథం చప్పుడు వినిపించింది. అతను తల ఎత్తి చూసేసరికి కొద్ది దూరాన రథంలో కూర్చుని వెళ్ళుతూ ఒక అతిలోక సౌందర్యవతి కనిపించింది.

ఆమెను చూడగానే అతనికి, "ఆహా, నేను మలయవతిని పెళ్ళాడకుండా ఈమెను పెళ్ళాడి ఉంటే ఎంత బాగుండేది!" అనిపించింది.

అతను చప్పట్లు కొట్టాడు గాని ఆమె తల తిప్పి చూడలేదు. ఆమెను అలా పోనివ్వటం ఇష్టంలేక, అతను ఆ రథం వెనకగా పరిగెత్త సాగాడు. కొండదార్లు ఎగుడు దిగుడుగా ఉన్నాయి. అయినా కువలయుడు ప్రయాస పడుతూ రథాన్ని వెంబడించి పరిగెత్తుతూనే వున్నాడు.

చాలా దూరం వెళ్ళి రథం ఆగింది. రథంలో నుంచి ఆ సుందరి దిగింది. కువలయుడు ఆమెను చూసి నిర్ఘాంతపోయాడు. ఆమె మలయవతే!

"మలయవతీ! నువేనా? నువు అవునా కాదా అని చూడటానికే ఇంతదూరం నీవెంట వచ్చాను. ఎక్కడికి పోతున్నావు? ఇంటికి పోదాం పద!" అన్నాడు కువలయుడు.

"పోదాం. నువు కూడా రథంలోకిరా," అన్నది మలయవతి.

ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు.

ఇది జరిగినది మొదలు కువలయుడి అసంతుష్టి పెరిగింది. ఒకనాడు అతను ఇంటికి వచ్చేసరికి మలయవతి ఇంట్లోలేదు. ఆమె తన వారి వద్దకు తిరిగి వెళ్ళిపోయిందని సేవకులు చెప్పారు.

ఆమె వెళ్ళి పోయాక పొలాల పంటలు పడిపోయాయి. పశువుల సంఖ్య క్షీణించ సాగింది.

"నాకిక మంచి రోజులు లేవు. నన్నేదో భూతం పీడిస్తున్నది," అనుకున్నాడు కువలయుడు. ఆ భూతం కనిపిస్తే దాన్ని హతమార్చటానికి నిశ్చయించుకున్నాడు.

కువలయుడు ఆ భూతం కోసం రాత్రిళ్ళు తారాడ సాగాడు. ఒకనాడది అతని కంట పడింది. కువలయుడు దాన్ని తరిమి పట్టుకుని, దానితో ఘర్షణపడి, పడదోసి, మీద ఎక్కి, దాన్ని చంపటానికి కత్తి ఎత్తాడు.

అంతలోనే మబ్బుల చాటునుంచి చంద్రుడు ఇవతలికి వచ్చాడు. వెన్నెలలో భూతం మొహం చూసి కువలయుడు కొయ్యబారిపోయాడు. ఆ భూతం ముఖం తన ముఖమే!

కువలయుడు కత్తిని దూరంగా పారేసి, ఆ భూతాన్ని అక్కడే వదిలి, ఇంటికి తిరిగి వచ్చాడు.

మలయవతి తలుపు తెరిచింది.

కువలయుడు ఆనందంతో, "మలయవతీ, తిరిగి వచ్చావా?" అన్నాడు.

"అవును. నువు నీలోని అసంతుష్టిని నిర్మూలించావు. ఇక మనం సుఖంగా జీవించగలం," అన్నది మలయవతి.

ఆమె అన్నమాట నిజమే అయింది. అటు తరవాత కువలయుడు అసంతృప్తి, అశాంతి అన్నది ఎరగకుండా, మలయవతితో సుఖంగా కాపరం చేశాడు.



# వైద్య రహస్యం

ఒక గ్రామంలో ఒక వైద్యుడు ఉండేవాడు. అతను వైద్యంలో సిద్ధహస్తుడు. అతను పేద లకు ఉచితంగా వైద్యం చేసి, ధనికుల వద్ద బాగా డబ్బు లాగేవాడు.

ఆ గ్రామంలోనే ఒక ధనవంతుడు ఉండేవాడు. ఆయనకు విషజ్వరం వచ్చింది. వైద్యుడు వచ్చి చూసి, వెంటనే చికిత్స జరగకపోతే ప్రమాదమని చెప్పాడు.

"మందుకు ఎంత అవుతుంది ?" అని ధనికుడు అడిగాడు.

"మందు నా వద్ద సిద్ధంగా లేదు. దినుసులు కొని తయారు చెయ్యాలి. అవి కొన టానికి పది రూపాయలవుతుంది," అన్నాడు వైద్యుడు.

ఇందులో వైద్యుడి కైంకర్యం చాలా ఉంటుందనుకుని ధనికుడు, "మందు దిను సుల జాబితా ఇవ్వండి, తెప్పిస్తాను," అన్నాడు.

వైద్యుడు జాబితా ఇచ్చాడు. కాని ఆ మందు దినుసులన్నీ ఊళ్ళో దొరకలేదు. ఒక మనిషి చేత ఆ వస్తువులు తెప్పించాడు. దినుసులు కొనటానికి పదిహేను రూపాయలూ, మనిషి తిరగటానికి మరో అయిదురూపాయలూ అయింది.

దినుసులు అందిన వెంటనే వైద్యుడు ధనికుడికి గుళికలు సీసాలో పంపాడు. వాటితో వ్యాధి నివారణ అయింది. కాని పది రూపాయలతో పోయే దానికి ధనికుడు ఇరవై ఖర్చు పెట్టుకున్నాడు.

—యస్. యమ్. డి. ఖాసిం.





# అండరాక్షసుడు

స్వప్నగృహ రాజనగరంలోని రాజోద్యానంలో ఒక ఉదయం ఒక పెద్ద గుడ్డు వెలిసింది. తోటమాలీలు దాన్ని చూసి, వెళ్ళి రాజు గారితో చెప్పారు. రాజుగారు దాన్ని తన భవనానికి తెప్పించాడు. అది రోజు రోజుకూ పెరిగి త్వరలోనే మనిషి ఎత్తు అయింది. అందులో నుంచి ఒక చిన్న రాక్షసుడు బయటికి వచ్చాడు.

రాజుగారు వాణ్ణి చూసి ముచ్చటపడి, వాణ్ణి అంతఃపురంలోనే పెరగ నిచ్చాడు. అయితే వాడు రోజుకు రెండు, మూడు అంగుళాల చొప్పున పెరుగుతూ చూస్తూండ గానే ఏడెనిమిది అడుగుల ఎత్తుకు ఎదిగాడు.

రాక్షసుడు తిన్నంత తిండి పెట్టటానికి రాజుగారు సిద్ధంగానే ఉన్నాడు. కాని రాక్ష సుడు మనుషులను చంపితినే ప్రయత్నాలు చేశాడు. వాణ్ణి అదుపులో ఉంచటానికి పది పన్నెండు మంది సాయుధ భటులను రాక్ష సుడి వెంట ఉంచవలిసి వచ్చింది. కాని రోజులు గడుస్తున్న కొద్దీ భటుల సంఖ్య పెరిగిపోతున్నది.

అందుచేత రాజుగారు రాక్షసుణ్ణి నిర్బం ధంలో పెట్టి ఉంచవలిసి వచ్చింది. కాని అందువల్ల రాక్షసుడిలో రాక్షస లక్షణాలు మరింత హెచ్చాయి. వాడు రంకెలు పెట్టి, గోడలు విరగదన్నీ నానా హంగామా చేయటం మొదలెట్టాడు.

రాజుగారు స్వయంగా వచ్చి వాడితో, "ఒరే, బాబూ! నిన్ను క్షణంలో చంపించ గలను. కాని చంపటం నా కిష్టం లేదు. నిన్ను వదిలేస్తాను. నువు మీ రాక్షసులుండే చోటికి పో," అన్నాడు.

రాక్షసుడికి రాజుగారంటే కొంత గురి ఉన్నది. వాడు ఆయనతో, "నన్ను విడిచి పెట్టండి. నేను మీ దగ్గిరే ఉంటాను. ఎక్క డికీ పోను!" అని మారాం చేశాడు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

రాజుగారికి ఏం చెయ్యటానికీ పాలుబో లేదు. ఆ పరిస్థితిలో రాజుగారి ఆస్థాన ఐంద్రజాలికుడు రాజుగారికి ఒక చిన్న కిటుకు చెప్పాడు.

రాజుగారు రాక్షసుడి వద్దకు ఖళ్ళీ వెళ్ళి, "ఒరే, నీకు ఒక చిన్న పరీక్ష పెడతాను. ఆ పరీక్షలో నెగ్గితే నిన్ను స్వేచ్ఛగా వది లేస్తాను. పరీక్షలో నువు నెగ్గకపోతే నువు మా దేశం విడిచి పెట్టి మీ రాక్షసులుండే చోటికి వెళ్ళి పోవాలి," అన్నాడు.

"ఏమిటా పరీక్ష?" అన్నాడు రాక్షసుడు.

"చాలా చిన్న పరీక్ష! కోడిగుడ్డును భోజనాల బల్ల మీద నిలువుగా నిలబెట్టాలి. నువు నిలబెట్ట గలిగితే మా రాజ్యంలోనే తిరగ వచ్చు. నిలబెట్ట లేకపోతే దేశం విడిచి పోవాలి. సమ్మతమేనా?" అన్నాడు రాజు.

"నేను అసలే అండరాక్షసుణ్ణి. అండాలు నేను చెప్పినట్టు వింటాయి. పరీక్ష పెట్టండి," అన్నాడు రాక్షసుడు.

"మాట తప్పవుగద?" అని రాజు అడిగాడు.

"అండరాక్షసులు ఎన్నడూ మాట తప్పరు!" అన్నాడు రాక్షసుడు గర్వంగా.

రాక్షసుణ్ణి విడుదల చేసి రాజుగారి ఇంటికి తెచ్చారు. భోజనాల బల్ల దగ్గిర రాక్షసుడు ఒక వైపునా, రాజుగారు ఇంకొక వైపునా కూర్చున్నారు. ఒక కోడిగుడ్డు తెచ్చి రాక్ష సుడి కిచ్చారు. దాన్ని వాడు నిలువుగా నిల బెట్టటానికి ఎన్నిసార్లు ప్రయత్నించినా అది పక్కకు ఒరిగిపోయింది.

రాజుగారు ఆ గుడ్డును తీసుకుని తన ముందు దాన్ని బల్లమీద నిలబెట్టి, "చూశావా, పరీక్షలో ఓడిపోయావు. నువు దేశం విడిచి వెళ్ళి, మీ రాక్షసుల దగ్గిర చేరు," అన్నాడు.

రాక్షసుడు నిజంగా మాట తప్పనివాడే. వాడు దేశం విడిచి వెళ్ళిపోయాడు.

"కోడిగుడ్డును నిలువుగా ఎలా నిల బెట్టారు?" అని మంత్రి రాజుగారిని అడిగాడు.

రాజుగారు బల్లమీద పరిచిన గుడ్డ పైకెత్తి చూపాడు. ఆ గుడ్డ కింద చిన్న ఉప్పుకుప్ప ఉన్నది. దానిమీదనే గుడ్డు నిలబడింది.





# కంకణాలు

హరిహరరాయలు హంపీరాజ్యాన్ని పాలించేటప్పుడు ఆయన వద్ద భాస్కరు డనే మంత్రి ఉండేవాడు. ఆయన మహాప్రతిభా సంపన్నుడు. రాయలు ఆయన మీది గౌరవం కొద్దీ ఆయన చేతులకు పచ్చల కంకణాలు తొడిగాడు.

మంత్రి భాస్కరుడు ప్రతి ఉదయమూ తన సేవకులను వెంట బెట్టుకుని తుంగభద్రానదికి వెళ్ళి, స్నానం చేసి, సంధ్యావందనం చేసుకుని ఇంటికి తిరిగి వచ్చేవాడు.

ఒక ఉదయం ఆయన స్నానం చేస్తూండగా ఆయన చేతి కంకణం ఒకటి జారి నదిలో పడిపోయింది. ఆయన సేవకులు ఆయన చేతికి కంకణం లేకపోవటం చూసి, "ఒక చేతి కంకణమే ఉన్నది. రెండోది ఏమయింది?" అని అడిగారు.

"నీటిలో జారిపడిపోయింది," అన్నాడు మంత్రి భాస్కరుడు.

"అది ఎక్కడ పడిపోయిందో చెప్పండి. మేము వెతికితీస్తాము," అన్నారు సేవకులు.

మంత్రి భాస్కరుడు తన రెండో చేతి కంకణం తీసి నదిలోకి విసిరివేస్తూ, "ఇది పడిన చోటనే ఆ కంకణం కూడా పడి ఉంటుంది," అని బయలుదేరి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

సేవకులు ఎంత వెతికినా ఒక్క కంకణం కూడా దొరకలేదు.

ఈ వార్త క్రమంగా రాయలవారి అంతరంగికులకు తెలిసింది. వారు రాయలవారితో, "మహారాజా, మంత్రిగారికి మీరు చూపే గౌరవంలో నూరోవంతు కూడా ఆయనకు మీపైన లేదు." అంటూ కంకణాల వృత్తాంతం చెప్పారు.

రాయలవారు ఈ సంగతి విని, తన భటులను పంపి భాస్కర మంత్రిని పిలిపించాడు. ఆయన చేతులకు కంకణాలు లేవు.

ఏ. వి. ఎల్. నరసింహారావు

అది చూసి రాయలవారు, "మంత్రి గారూ, మేము బహూకరించిన పచ్చల కంకణాలను మా వద్దకు వచ్చేటప్పుడైనా ధరించకూడదా?" అన్నాడు.

అప్పుడు మంత్రి భాస్కరుడు, "మహా రాజా, తమరు బహూకరించిన కంకణాలను నేనై తీయలేదు. నేను స్నానానికి వెళ్ళితే, నా తల్లి గంగాభవాని ఒక చేతి కంకణం పుచ్చుకున్నది. ఆవిడ ఒక చేతికే కంకణం ధరించటం బాధగా తోచి, నా రెండో చేతి కంకణం కూడా ఆవిడకు సమర్పించి వచ్చేశాను," అన్నాడు.

ఈ మాట విని రాయలవారికి అమితమైన ఆగ్రహం కలిగింది. కాని ఆయన దాన్ని పైకి కనపడనీయక, "మీరు సమర్పించిన కంకణాలను ధరించిన గంగాభవాని చేతులు చూడాలని నాకు ఎంతో ఉత్సాహంగా ఉన్నది. వాటిని చూపిస్తారా?" అని వ్యంగ్యంగా అడిగాడు

"రేపు ఉదయం నేను తుంగభద్రా నదిలో స్నానం చేసే సమయంలో తమరు అక్కడికి దయచేయండి," అన్నాడు మంత్రి భాస్కరుడు.

మర్నాడు రాయలవారు సపరివారంగా తుంగభద్రా నదికి బయలుదేరారు.

మంత్రి భాస్కరుడు స్నానంచేసి, గంగాస్తవం పఠించి, "తల్లీ, కంకణాలు ధరించిన నీ చేతులను వీరందరికీ చూపి, సంతోషం కలిగించు!" అన్నాడు.

వెంటనే నదిలో నుంచి రెండు చేతులు పైకిలేచాయి. వాటికి పచ్చల కంకణాలున్నాయి. కొద్ది క్షణాలు గడిచాక ఆ చేతులు నీటిలో మునిగిపోయాయి.

ఇలా జరిగాక రాయలవారికి చాలా సిగ్గు కలిగింది. ఆయన నగరానికి వెళ్ళిపోయి, తరవాత మంత్రిని పిలిపించి, క్షమాపణ చెప్పుకున్నాడు.

"మహారాజా, నాలాంటి వారిని ఎందరినో తమరు కాపాడుతున్నారు. నాకు మీరు క్షమాపణ చెప్పటమేమిటి? నాకు తమ అనుగ్రహం ఉంటే, అంతే చాలు!" అన్నాడు మంత్రి భాస్కరుడు.





# మహాభారతం

పాండవుల అరణ్యవాసం పన్నెండో ఏడు పూర్తి కాబోతున్నది. ఇంద్రుడు పాండవులకు మేలు చేసే ఉద్దేశంతో బ్రాహ్మణ రూపంలో కర్ణుడి వద్దకు వెళ్ళి, అతని సహజ కవచకుండలాలు యాచించాలని నిశ్చయించాడు. ఈ సంగతి కర్ణుడి తండ్రి అయిన సూర్యుడికి తెలిసింది. సూర్యుడు ఒకనాటి వేకువజామున కర్ణుడికి కలలో కనిపించి, "కర్ణా, నువు బ్రాహ్మణులకు ఏది అడిగినా ఇస్తావు. అందుచేత ఇంద్రుడు నీ దగ్గిరికి బ్రాహ్మణవేషంలో వచ్చి, నీ సహజ కవచకుండలాలు దానం అడుగుతాడు. ఆయనకు మరేదన్నా ఇయ్యి గాని కవచకుండలా లియ్యకు. అవి ఉన్నంత కాలమూ నిన్ను ఎవరూ యుద్ధంలో చంపలేరు. అవి పోతే మాత్రం నీకు తప్పక చావుకలుగుతుంది." అని చెప్పాడు.

"దేవా, నువు స్వయంగా వచ్చి నాకు హితబోధ చెయ్యటమే నాకు పదివేలు. కాని, బ్రాహ్మణులు అడిగినది ఇవ్వటం నా వ్రతం. దీని మూలాన లోకంలో నాకు ఖ్యాతి వచ్చింది. అలాటప్పుడు దేవేంద్రుడంతటివాడు వచ్చి నా సహజ కవచకుండలాలు అడిగితే ఎలా ఇయ్యకుండా ఉంటాను? అందుచేత తప్పక ఇస్తాను. దానివల్ల నా కీర్తి మరింత పెరుగుతుంది. పాండవులకు అపకీర్తి వస్తుంది. కీర్తి పోయాక బతికి ఉండి మాత్రం లాభమేమిటి?" అన్నాడు కర్ణుడు.

"పిచ్చివాడా, శరీరమే పోయాక కీర్తితో ఏం పని? అది శవాలంకరణ లాటిది. నీకూ,

37. యక్షప్రశ్నలు



అర్జునుడికీ తప్పక యుద్ధం కలుగుతుంది. నీకు కవచకుండలాలు ఉన్నంత కాలమూ అర్జునుడు ఇంద్రుణ్ణి తోడుతెచ్చుకున్నా నిన్ను గెలవలేడు. అందుచేత వాటిని ఇంద్రుడికి ఇయ్యకు," అన్నాడు సూర్యుడు.

"దేవా, నన్ను క్షమించు. బ్రాహ్మణులు వచ్చి అడిగితే ప్రాణాలన్నా ఇవ్వాలన్నది నా నియమం. కవచకుండలాల సహాయం లేకుండానే నేను అర్జునుణ్ణి గెలవగలను. నా వద్ద పరశురాముడూ, ద్రోణుడూ ఇచ్చిన అస్త్రాలు ఉన్నాయి," అన్నాడు కర్ణుడు సూర్యుడితో.

"నీకు అంత పట్టుదలగా ఉంటే, ఒక పని చెయ్యి. ఇంద్రుడి వద్ద ఒక అమోఘమైన శక్తి ఉన్నది. దానితో ఎలాటి శత్రువునైనా చంపవచ్చు. అది శత్రువును చంపి తిరిగి వస్తుంది. ఇంద్రుడు నీ కవచకుండలాలు యాచించినప్పుడు నువు ఆ శక్తిని అడుగు. దానితో నువు అర్జునుణ్ణి గెలవగలుగుతావు," అన్నాడు సూర్యుడు.

ఇంతలో కర్ణుడు నిద్రలేచి తెల్లవారుతూ ఉండటం గమనించి, ఇంద్రుడి రాకకు ఎదురు చూడసాగాడు. అతను రోజూ మధ్యాన్నం వేళ సూర్యోపాసన చేసి, బ్రాహ్మణులకు అడిగిన దానాలు చేసేవాడు. ఈనాడు ఆ సమయంలో ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి, "భిక్షాం దేహి," అన్నాడు.

కర్ణుడు ఆయనను తన అలవాటు ప్రకారం పూజించి, "బ్రాహ్మణా, నీకు ఏం కావాలి? అందమైన స్త్రీలా? సారమైన భూములా? మంచి గోవులా? ఏది కావాలో కోరు," అన్నాడు.

"నాయనా, నాకు అవి ఏమీ వద్దు. నీ సహజ కవచమూ, కుండలాలూ కోసి ఇయ్యి," అన్నాడు ఇంద్రుడు.

"బ్రాహ్మణోత్తమా, ఈ కవచకుండలాలు నా ప్రాణాన్నికాపాడేవి. ఇవిగాక మరేదైనా కోరు," అన్నాడు కర్ణుడు. ఆ బ్రాహ్మణుడు ఇంద్రుడేనని అతనికి తెలిసిపోయింది.

"కాదు, నాకు నీ కవచకుండలాలే కావాలి," అన్నాడు ఇంద్రుడు.

కర్ణుడు నవ్వి, "నువు ఇంద్రుడి వని నాకు తెలుసు. మా వంటి వారికి వరాలు ఇవ్వవలసిన నువు ఇలా యాచనకు దిగటం బాగాలేదు. నీకు నేను కవచకుండలాలు ఇచ్చేసినట్టయితే శత్రువులకు తేలికగా ఓడి, అపఖ్యాతి పాలవుతాను. అందుచేత కవచ కుండలాలు ఇస్తానుగాని, నాకు అమోఘ మైన నీ శక్తిని ఇయ్యి." అన్నాడు.

దానికి ఇంద్రుడు, "నా శక్తిని అలాగే ఇస్తాను. కాని నువు దానిని ఒక్కణ్ణి చంప టానికి మాత్రమే ఉపయోగించ గలుగుతావు. నువు ప్రయోగించగానే అది నీ శత్రువును చంపి నా దగ్గిరికి తిరిగి వచ్చేస్తుంది. దానికి అభ్యంతరం లేకపోతే తీసుకో," అన్నాడు.

"దేవా, నాకు ఉన్న శత్రువు ఒక్కడే. అతన్ని చంపటమే నా కోరిక," అన్నాడు కర్ణుడు.

"నాకు తెలుసు. ఈ శక్తితో అర్జునుణ్ణి చంపాలను కుంటున్నావు, కాని కృష్ణుడు అతనికి అండగా ఉండగా అతన్ని చంపటం నీకు సాధ్యం కాదు. ఏమయినా, నేనిచ్చే శక్తిని ప్రాణాపాయ సమయంలో, నీ వద్ద ఉండే ఇతర అస్త్రాలేవీ పనికిరానప్పుడు మాత్రమే ఉపయోగించు. తొందరపడి అనామకులపైన గాని, అనవసరంగా గాని ప్రయోగిస్తే ఈ శక్తి నీ ప్రాణాలే తీస్తుంది," అని హెచ్చరించాడు ఇంద్రుడు.



తన శరీరంతో పుట్టి పెరిగిన కవచకుండ లాలను కోసి ఇచ్చినప్పుడు తనకు వికృత రూపం కలగకుండా చెయ్యమని కర్ణుడు కోరాడు. ఇంద్రుడు సరేనన్నాడు. కర్ణుడు ఇంద్రుడి నుంచి శక్తి గ్రహించి, ఆయనకు తన శరీరంనుంచి కవచాన్ని, కుండలాలనూ కోసి ఇచ్చాడు.

కర్ణుడి కవచకుండలాలు పోయాయన్న వార్త తెలిసి పాండవులు పరమానందం చెందారు, కౌరవులు దుఃఖించారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూ ఉండగా ఒక బ్రాహ్మణుడు పరిగెత్తుకుంటూ వచ్చి, "నేను అరణిని ఒక చెట్టుకొమ్మకు తగిలించాను. ఇంతలో ఒక దుప్పి వచ్చి



ఆ చెట్టును తన శరీరంతో రుద్దుతూ ఉండగా నా అరణి దాని కొమ్ములకు తగులుకున్నది. ఆ దుప్పి నా అరణితో సహా పారిపోతున్నది. అది లేకుండా నా అగ్నికార్యం సాగదు. దయచేసి నా అరణిని నాకు తెచ్చిఇయ్యండి," అన్నాడు.

వెంటనే పాండవులు ఆ దుప్పి వెంట పరిగెత్తి, దాన్ని బాణాలతో కొట్టారు. కాని ఒక్క బాణమూ ఆ దుప్పికి తగలలేదు. పైపెచ్చు, అది అంతకంతకూ వారికి దూరమై, చివరకు కీకారణ్యంలో కనబడకుండా పోయింది.

పాండవులు అయిదుగురూ అలిసిపోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ ఒక చెట్టు నీడన చతికిలబడ్డారు. అప్పుడు నకులుడు, "మనకిలా కష్టాల మీద కష్టాలు రావటానికి కారణమేమిటో?" అన్నాడు.

"పూర్వజన్మలో చేసుకున్న దుష్కృతాల వల్ల ఈ జన్మలో కష్టాలుకలుగుతాయి," అన్నాడు ధర్మరాజు.

"ఆనాడు ద్రౌపదిని సభలోకి తెచ్చినప్పుడే నేనాదుర్మార్గులను చంపకపోవటం చేత ఇలా అగచాట్లు పడుతున్నాం," అన్నాడు భీముడు.

"జూదం ఆడేటప్పుడు కర్ణుడు పేలిన మాటలను నేను శాంతంగా సహించటంవల్ల మనం అప్రయోజకుల మల్లే అరణ్యానికి వచ్చామేమో, అవస్థలు పడుతున్నాం," అన్నాడు అర్జునుడు.

"ఆ శకునిగాణ్ణి అప్పుడే చంపేసి ఉంటే మనకే పాట్లూ ఉండేవి కావు," అన్నాడు సహదేవుడు.

ధర్మరాజు నకులుణ్ణి చూసి, "అందరికీ దాహంగా ఉన్నది. ఈ చెట్టెక్కి, ఎక్కడన్నా నీరున్నదేమో చూసి, బాణాల పొదితో నీరు తీసుకురా," అన్నాడు.

నకులుడు చెట్టెక్కి దగ్గిరలోనే నీరున్న జాడలు తెలుసుకుని, అక్కడికి వెళ్ళి తాను దాహం తీర్చుకుని, మిగిలిన వారికి నీరు తెచ్చి పెట్టటానికి బయలుదేరాడు. అతను ఒక సరోవరాన్ని చేరుకుని, నీరు తాగబో



తూండగా, ఏదో అశరీర వాక్కు, "ఆగు! నేనడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి నీరుతాగు. ఈ సరస్సు నాది," అన్నది.

నకులుడు ఆ మాటలను లక్ష్యపెట్టక, నీరుతాగి, మూర్ఛపోయాడు. అతను ఎంతకూ రాకపోయేసరికి ధర్మరాజు సహదేవుణ్ణి పంపాడు. సహదేవుడు కూడా సరస్సును చేరుతూనే, చచ్చిపోయినట్టు పడి ఉన్న నకులుణ్ణి చూసి ఆవేదనపడుతూ, దాహ బాధ భరించలేక, అశరీరవాణి మాటలు పెడ చెవిని బెట్టి, నీరుతాగి, తాను కూడా పడిపోయాడు.

తరవాత ధర్మరాజు, వెళ్ళిన వారి జాడ తెలుసుకురమ్మని అర్జునుణ్ణి పంపాడు. అర్జునుడు సరస్సుచేరి తమ్ములను చూశాడు. వారిని అలా చేసినవారు ఎవరా అని చుట్టూ చూస్తే ఎక్కడా ఒక పిట్ట కూడా లేదు. దాహ బాధకు తాళలేక అతను నీరు తాగ బోతుండగా అతనికి కూడా అదృశ్యవాక్కులు వినిపించాయి.

"సామర్థ్యం ఉంటే నా ఎదట కనబడు. అదృశ్యంగా ఉండి మాట్లాడుతావెందుకు?" అంటూ అర్జునుడు ధ్వని వచ్చిన దిక్కుగా బాణాలు వేసి, నీరుతాగి తానుకూడా పడిపోయాడు. అతని తరవాత భీముడు వచ్చి, అశరీర వాక్కులను పెడచెవిని బెట్టి, నీరుతాగి పడిపోయాడు.

చివరకు ధర్మరాజు స్వయంగా బయలుదేరి సరస్సు వద్ద ప్రాణాలు లేకుండా పడి ఉన్న తమ్ములను చూసి ఎంతో దుఃఖించాడు. అప్పుడు అశరీర వాక్కు ఇలా అన్నది:

"నేనొక కొంగను. నేనీ సరస్సులో చేపలను తిని జీవిస్తూ ఉంటాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా నీరు తాగినందుకు నీ తమ్ములను చంపాను. నువ్వైనా నా ప్రశ్నలకు సమాధానాలు చెప్పి నీకు కావలసినంత నీరు తీసుకో. లేదా, నీకు కూడా వారి గతే పట్టుతుంది."

ఈ మాటలు విని ధర్మరాజు, "నా తమ్ములు ఒక పక్షి చేత చచ్చేవారు కారు.

నువు కొంగవు కావు. నువు ఎవరు? నీకేం కావాలి?" అని అడిగాడు.

"అవును, నేను కొంగను కాను, యక్ష రాజును," అంటూ ఆ యక్షుడు తాడి ప్రమాణాన సరస్సు ఒడ్డున ధర్మరాజుకు కనిపించి, "నీకు నీరు కావాలంటే నా ప్రశ్నలకు సరి అయిన సమాధానాలియ్యి." అన్నాడు.

"అడుగు, నాకు సాధ్యమైతేచెబుతాను," అన్నాడు ధర్మరాజు.

యక్షుడు అనేక ప్రశ్నలు వేశాడు. ధర్మరాజు చెప్పిన సమాధానాలు యక్షుణ్ణి తృప్తి పరిచాయి.



"నీ సమాధానాలకు సంతోషించాను. చచ్చిపోయిన నీ తమ్ములలో ఒక్కణ్ణి బతికిస్తాను. ఎవణ్ణి బతికించమంటావో కోరుకో," అన్నాడు యక్షుడు.

"యక్షరాజా, నకులుణ్ణి బతికించు," అన్నాడు ధర్మరాజు.

"మహా బలుడైన భీముణ్ణీ, మహా పరాక్రమశాలి అయిన అర్జునుణ్ణీ వదిలి, నీ సవతి తల్లి కొడుకైన నకులుణ్ణి ఎందుకు బతికించమంటున్నావు?" అని యక్షుడు అడిగాడు.

"మా తండ్రికి కుంతీ, మాద్రీ ఇద్దరు భార్యలు. కుంతి కొడుకులలో నేను బతికి ఉన్నాను. మాద్రి కొడుకులలో ఒకడు బతికి ఉండటం ధర్మమని నాకుతోచింది." అన్నాడు ధర్మరాజు.

"మంచిది. ధర్మద్రోహం చెయ్యక పోవటమే ఉత్తమ ధర్మంగా భావించావు. నీ తమ్ములందరినీ బతికిస్తాను," అన్నాడు యక్షుడు. వెంటనే భీమార్జున నకుల సహదేవులు నిద్రలేచినట్టు లేచి కూర్చున్నారు. వారిలో ఆకలిదప్పుల జాడకూడాలేదు.

"అయ్యా, నువు మామూలు యక్షుడవు కావు, ఏ దేవతవో చెప్పు." అని ధర్మరాజు అడిగాడు.

దానికా యక్షుడు, "నేను ధర్మదేవతను. నీ తండ్రిని. నిన్ను పరీక్షించటానికి వచ్చాను," అన్నాడు.

"దేవా, ఒక బ్రాహ్మణుడి అరణిని ఒక దుప్పి తీసుకుని పారిపోయింది. పాపం, అది లేకుండా ఆయన అగ్ని కార్యం చేయ లేడు. ఆయన దైనిక కర్మకాండకు విఘ్నం రాకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

"నేనే ఆ దుప్పిని. మిమ్మల్ని యిక్కడికి రప్పించేందుకు ఆ పని చేశాను. ఇదిగో ఆ బ్రాహ్మణుడి అరణి. ఏదన్నా వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు ధర్మదేవత.

"మా పన్నెండేళ్ళ వనవాసం పూర్తి అవుతున్నది. అజ్ఞాతవాసకాలంలో మమ్మల్ని ఎవరూ గుర్తించకుండా అనుగ్రహించు," అన్నాడు ధర్మరాజు.

ధర్మదేవత అలాగేనని వరమిచ్చి అదృశ్యుడయాడు.

పాండవులు అరణిని తీసుకు పోయి, దాన్ని పోగొట్టుకున్న బ్రాహ్మణుడికి ఇచ్చారు. తన అగ్ని కార్యానికి భంగం రాకుండా కాపాడినందుకు ఆ బ్రాహ్మణుడు పాండవులకు తన కృతజ్ఞత తెలుపుకుని, వారికి విజయం చేకూరాలని ఆశీర్వదించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

త్వరలోనే పాండవుల వనవాసం ముగిసింది. వాళ్ళు తమ వెంట ఇంతకాలమూ ఉండిన బ్రాహ్మణుల వద్ద సెలవు పుచ్చుకుని, వారికి నమస్కరించుతూ, "బ్రాహ్మణోత్తములారా, మా నియమం ప్రకారం ఇక నుంచీ ఏడాదిపాటు అజ్ఞాతవాసం జరపాలి. అందుచేత మీ వద్ద సెలవు పుచ్చుకుంటున్నాము," అని చెప్పి, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా సాగేటట్టు వారి ఆశీర్వాదం పొందారు.

అప్పుడు ధౌమ్యుడు ధర్మరాజుతో, "ఇంద్రుడికే అజ్ఞాతవాసం తప్పలేదు. త్వరలోనే మీ కష్టాలు తీరిపోతాయి," అన్నాడు.

పాండవులు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీ వెంట బెట్టుకుని తమ ఆశ్రమం నుంచి కొంతదూరం వెళ్ళి, అక్కడ ఏకాంతంగా, మర్నాటి నుంచీ తాము ప్రారంభించ వలసిన అజ్ఞాత వాసం గురించి రహస్య చర్చలు చేశారు.





# శివపురాణం

## 14

శివుడు ఏమైపోయినదీ పార్వతికి తెలియరాక, రుద్రగణాల చేత లోకాలన్నీ వెతికించి, శివుడు లింగరూపంలో గజాసురుడి హృదయంలో ఉన్నట్టు తెలుసుకున్నది.

ఆమె వెంటనే విష్ణువు వద్దకు వెళ్ళి, "అన్నా, నా భర్తను గజాసురుడు లింగరూపంలో తన హృదయంలో దాచుకున్నాడు. నువు అయనను తిరిగి కైలాసానికి చేర్చాలి," అని ప్రార్థించింది.

విష్ణువు అలాగే చేస్తానని మాట ఇచ్చాడు. శివుడు కైలాసానికి తిరిగివచ్చేదాకా గణపతులందరిలోకీ పెద్దవాణ్ణి కైలాసాన్నీ, పార్వతినీ సంరక్షించటానికి ఏర్పాటు చేసి, విష్ణువు రుద్ర, వీరభద్రగణాలతో బ్రహ్మ వద్దకు వెళ్ళాడు. దేవేంద్రుడు మొదలైన వారు కూడా వచ్చి, విష్ణువు తలపెట్టిన పని గురించి విన్నారు.

తరవాత అందరూ మారురూపాలు ధరించి రుద్రగణాలతో సహా శోణితపురం వెళ్ళారు. నంది గంగిరెద్దుగా మారాడు. మిగిలినవాళ్ళంతా వివిధవాద్యాలు వాయించేవాళ్ళ వేషాలు ధరించారు. విష్ణువు ఎద్దును ఆడించేవాడుగా మారాడు. వాళ్ళందరూ శోణితపురం వీధులలో తిరుగుతూ, గంగిరెద్దును ఆడిస్తూ, శివస్తోత్రాలు చేస్తూ వచ్చారు.

గంగిరెద్దు అద్భుతంగా మనుషులు చెప్పినట్టు చేస్తున్నదని విని, గంగిరెద్దుల వాళ్ళను గజాసురుడు తన సభకు పిలిపించాడు. గంగిరెద్దు పాటకు తగినట్టుగా నృత్యం చేసింది. వాళ్ళు పాడే పాటలన్నీ శివస్తోత్రాలు. ఆ స్తోత్రాలకు పొంగి, గజాసురుడి గుండెలో ఉన్న శివలింగం పెరగసాగింది.

అట్ట చివరి బొమ్మ



ఇదంతా తెలిసి గజాసురుడి పరివారం యుద్ధానికి వచ్చారు. ఆ రాక్షసుల నందరినీ విష్ణువు చంపేశాడు.

తరవాత బ్రహ్మ, విష్ణు, దేవేంద్రుడూ, నందీశ్వరుడూ మొదలైన వారు తమ ఎప్పటి రూపాలు దాల్చి శివుడికి నమస్కారం చేశారు. వారంతా రుద్రగణాలను వెంట బెట్టుకుని కైలాసానికి వచ్చారు. శివుడు, తాను గజాసురుణ్ణి చంపి తిరిగి వచ్చినట్టు పార్వతికి కబురు పంపాడు.

అప్పటికే ఈ వార్త తెలిసి సంతోషించిన పార్వతి, తలంటి పోసుకుని గృహదేవతలను పూజించే ఉద్దేశంతో, సింహద్వారంలో ఉన్న లక్ష్మిగణాధిపతులతో, "నాయనలారా, నేను తలంటుకోబోతున్నాను. నేను చెప్పే దాకా ఎవరినీ లోపలికి రానివ్వకండి," అని చెప్పింది.

మరికొంత సేపటికి నందీశ్వరుడు మొదలైనవారు వచ్చి, లోపలికి ప్రవేశించబోయారు. అప్పుడు లక్ష్మిగణపతులు వారికి అడ్డు తగిలి, "అమ్మ తలంటుకుంటున్నది. లోపలికి ఎవరినీ రానీయవద్దన్నది. అందుచేత ఆమె చెప్పేదాకా మీరు లోపలికి పోరాదు," అన్నారు.

"మాకు ఈశ్వరాజ్ఞ ఉన్నది. మూడు లోకాలలోనూ ఈశ్వరాజ్ఞకు ఎదురు లేదు. మధ్య మీరెవరు?" అంటూ రుద్రగణాల

లింగం పెరిగిపోతున్నకొద్దీ గజాసురుడికి ఊపిరి సలపలేదు. అతను తనకు చావు మూడిందని గ్రహించి, "పరమేశ్వరా, రక్షించు!" అన్నాడు.

"గజా, నీకు చావు తప్పదు. వరం కోరు," అన్నాడు శివుడు.

"నా తల పూజనీయంగా ఉండాలి. నా చర్మం నువు ధరించాలి. నాకు జన్మరాహిత్యం కావాలి. ఈ వరాలు ప్రసాదించు," అన్నాడు గజాసురుడు.

శివుడు అతనికి కోరిన వరాలిచ్చి, అతను ఎలుకరూపంలో తన వద్ద ఉండేటట్టు అనుగ్రహించి, గజాసురుడి పొట్ట చీల్చుకుని బయటికి వచ్చాడు.

వాళ్ళు లక్ష్మిగణాల వాళ్ళతో కయ్యానికి దిగారు. కోలాహలం జరిగింది.

ఈ కోలాహలం విని పార్వతి పరిచారిక ఒకతె వచ్చి చూసి, పార్వతి వద్దకు వెళ్ళి, "లక్ష్మిగణాల వాళ్ళూ, రుద్రగణాల వాళ్ళూ కొట్టుకుంటున్నారు," అని చెప్పింది.

రుద్రగణాల వాళ్ళ ప్రవర్తనకు కోపగించి పార్వతి లక్ష్మిగణాల వాళ్ళకు సహాయంగా దేవగణాల వాళ్లను పంపింది. లక్ష్మిగణాలూ, దేవగణాలూ ఏకమై రుద్రగణాల వాళ్ళను చావగొట్టి తరిమేశాయి. వాళ్ళు పారిపోయి, జరిగిన సంగతి శివుడికి చెప్పారు.

అక్కడ ఉన్న నారదుడు, "పార్వతి ద్వారపాలకులకు ఇంత పొగరా? శివుడి ఆజ్ఞనే ధిక్కరిస్తారా?" అన్నాడు.

తన భృత్యులు దెబ్బలు తిన్నందుకే మండి పోతున్న శివుణ్ణి నారదుడి మాటలు మరింత రెచ్చగొట్టాయి. ఆయన తన త్రిశూలాన్ని పంపి లక్ష్మిగణాల వాళ్ళ తలలు నరికించేశాడు. తన ముద్దుల కొడుకుల తలలు తెగిపోయినందుకు పార్వతి విచారంలో మునిగిపోయింది.

పార్వతీదేవి ద్వారం వద్ద ఇప్పుడెవరూ అడ్డేవారు లేరు. అందుచేత శివుడు బ్రహ్మ విష్ణులను వెంట బెట్టుకుని పార్వతి ఇంటికి వచ్చాడు. అప్పటికే తలంటి పోసుకుని, శృంగారించుకుని, గృహదేవతలను పూజించిన పార్వతి, లక్ష్మిగణాల చావుకు విచారంలో మునిగి ఉండటంచేత వచ్చిన వారిని గౌరవించ లేదు.



శివుడు పార్వతి విచారాన్ని పోగొట్టుదామని పార్వతిని సమీపించాడు. కాని పార్వతి శివుడి కేసి చూడనన్నా లేదు.

అప్పుడు విష్ణువు పార్వతిని సమీపించి, "చెల్లీ, గజాసురుడు చచ్చినందుకు మూడు లోకాలూ ఆనందంలో మునిగి ఉండగా నువు విచారంలో మునిగి ఉండటానికి కారణమేమిటి? నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు. నేను తీర్చుతాను," అన్నాడు.

పార్వతి విష్ణువుతో, "అన్నా, శివుడు నిష్కారణంగా నా కొడుకులైన లక్ష్మిగణాల వారిని చంపాడు. వాళ్ళను బతికించి, వాళ్ళకు తగిన అధికారాలను ఇస్తేగాని నా విచారం తీరదు," అన్నది.

త్రిమూర్తులతో శివుడు, గజాసురుడికి తాను ఇచ్చిన వరాలమాట చెప్పాడు. తన తల పూజనీయంగా ఉండాలనీ, తన చర్మాన్ని శివుడు ధరించాలనీ గజాసురుడు శివుణ్ణి కోరి ఉన్నాడు.

అందుచేత లక్ష్మిగణాలకు అధిపతి అయిన వాడి శరీరాన్ని సభకు తెప్పించి, రుద్రగణాలను పంపి గజాసురుడి తల తెప్పించి, దాన్ని లక్ష్మిగణాధిపతి శరీరానికి అతికించారు. వెంటనే లక్ష్మిగణాధిపతి నిద్ర లేచిన వాడిలాగా లేచి నిలబడి పార్వతికీ, విష్ణువుకూ నమస్కారం చేశాడు. అదే విధంగా మిగిలిన ఇరవైమంది గణాధిపతుల మొండాలకూ ఏనుగు తలలు తగిలించారు. వెంటనే వారు కూడా బతికారు. లక్ష్మిగణాల వాళ్ళు ఈవిధంగా సజీవులు కాగానే పార్వతీ దేవి పరమానందం చెందింది.

ఆ ఆనంద సమయంలో విశ్వదర్మి అనే ఉపబ్రహ్మ సభలో లేచి నిలబడి, "శివ పార్వతులారా, నా కుమార్తెలైన జయలక్ష్మి మొదలైన వాళ్ళను లక్ష్మిగణాధి పతులకు ఇచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నాను," అన్నాడు.

ఈ మాటకు అందరూ సంతోషించారు. బ్రహ్మ తానే పురోహితుడుగా ఉండి, విశ్వదర్మి కూతుళ్ళను గణాధిపతులకు పెళ్ళి చేశాడు. గణాధిపతులలో లక్ష్మిగణపతి పెద్ద వాడు. అతని భార్య జయలక్ష్మి.



# 124. సినాయ్ పర్వతం

ఈ పర్వతం మీదనే మోజెస్ "పది శాసనాలు" (టెన్ కమాండ్‌మెంట్స్) స్వీకరించాడు. దిగువనున్న దుర్గంలో తొలికాలపు క్రైస్తవులు తలదాచుకున్నారు. ఇది సినాయ్ ఎడారి మధ్య ఉన్నది.



Photo by Suraj N. Sharma



· బహుమతి
పొందిన వ్యాఖ్య

చిన్నతనాలు

పంపినవారు:
వి. వి. ఆర్. మూర్తి

Photo by Suraj N. Sharma



సూర్యారావుపేట,
కాకినాడ.

చిలిపి చేష్టలు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు మార్చి నెల 20 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మే నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట: పెళ్ళికూతురు

మూడవ అట్ట: పేరంటాళ్ళు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# టెబీ మరియు ఆటవికులు


టెబీనూ డాగ్ విహారానికి వెళ్లారు.
ఈ ద్వీపం ఏమిటో చూద్దాం, డాగ్.


ద్వీపంపై వారికి దుస్థితి తప్పదు.
కొత్త వాళ్లు. వారిని చంపండి.


త్వరలోనే...
పద పరుగెత్తుకు పోదాం, డాగ్.


నే పోలేను. నీరసం వచ్చింది.


వాళ్లను కట్టేయండి.
ఆగు. మీ దొర పడి పోయాడు.


ఇవుగో దొరా, రుచిగల ఎనర్జీ టెబ్స్ శక్తిని త్వరగా ఇస్తాయి!
వహ్వా! ఎంత బాగుంది!


కృతజ్ఞత, మిత్రమా. నీవు నా గౌరవ అతిథివి.
వహ్వా! కొద్దిలో బతికాం.


మళ్లా త్వరగా రా, ఇంకా రంగుల టెబ్స్ తీసుకు రా
ఓ, ఎనర్జీ టెబ్స్.

*FOR PRECISION IN...*

# Colour Printing

*By Letterpress...*

...Its B. N. K's., superb printing
that makes all the difference.
Its printing experience of
over 30 years is at the
back of this press superbly
equipped with modern
machineries and technicians
of highest calibre.






టివియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకంగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్లు చూస్తాము అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టివియస్‌కు ఇచ్చే ప్రతీ టైరూ కూడా ట్రెడ్‌ను పదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది. అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషినులమీద మంచి నైపుణ్యతగల సాంకేతిక సిబ్బంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని టివియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు. ఆశ్చర్యములేదు టివియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు చెల్లించే ప్రతీ రూపాయికి అధికంగా టైరు మైళ్ళనిస్తాయి.

మీరు టివియస్‌ను విశ్వసించవచ్చు—భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.






మీరు టివియస్‌ను విశ్వసించగలరు

సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్

బెంగళూరు-కోయంబత్తూరు-కలమశేరి-మద్రాసు-పుదుకోటై-సేలం-సికింద్రాబాద్-తిరునెల్వేలి-విజయవాడ.

SI 6073

ఇవాళ—జానకి ఇంటి పనంతా ముగించు కొని అమ్మగారింటికి వెళ్ళి వచ్చేటప్పుడు బజారుకు కూడా వెళ్ళి వచ్చింది ఇప్పుడు-కొడుకు రాజన్‌తో ఆడే సమయం.

# "ఎన్ని చెప్పండి హార్లిక్స్ పుష్టే పుష్టి"

అంటుంది జానకి

పూర్తి మీగడగల పాలు మరియు పక్వంగా పండిన గోధుమలలో గల మాంసకృత్తుల సారంతో మంచి సత్తువ నిచ్చేది హార్లిక్స్.

హార్లిక్స్ ఏరోజు కారోజు ఆహారంలో లోపించిన సత్తువలను పూరించి అదనపు శక్తిని, బలాన్ని చేకూర్చుతుంది.

తల్లులు హార్లిక్స్‌నే నమ్ముతున్నారు. మరియు డాక్టర్లు 80 సంవత్సరాలకు పైగా దీనిని సిఫారసుచేస్తున్నారు.

హార్లిక్స్ త్రాగండి. అది మంచి పుష్టికరమైనది యదార్థమైన పుష్టిని, అదనపు శక్తిని మీకు చేకూర్చుతుంది.

## 'హార్లిక్స్'- మంచి పుష్టికరమైనది

రిజిష్టర్ కావింప బడిన ట్రేడ్ మార్కు.




HL-2816 A

తప్పక చూడండి!

చలనచిత్ర సమర్పించు

# మహమ్మద్ బిన్ తుగ్లక్



దర్శకత్వం: B.V. ప్రసాద్

నిర్మాత: V. జగన్మోహనరావు

STUDIO Ketha

డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర: విజయా కంబైన్సు - సీడెడ్: బలరాం పిక్చర్సు - నైజాం: శ్రీ వెంకటేశ్వర మూవీస్

